# కధావళి

రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

జూనియర్ తెలుగు పండిట్,

బోర్డుహైస్కూలు



ప్రకాశకులు

కళాకల్లోలినీ గ్రంథమాల

మానికొండ.

1953 వెల రు 1-0-0

# క థా వ

రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి
జూనియర్ తెలుగు పండిట్
బోర్డుహైస్కూలు



ప్రకాశకులు
కళాకల్లోలినీ గ్రంథమాల
మానికొండ.

# విషయ సూచిక

# రెండు మాటలు

పాఠక మహాశయులారా!

ఇందలి కథానికలలో కొన్ని యిదివరకే పత్రికలలో ప్రచురితములైనవి. ఇవి గ్రంథస్థములు కానిచో కాలగర్భమున లీనమగునను నభిప్రాయముతోడను, పఠితలకు ముహుర్ముహుః పఠనావకాశము కలిగించు నిచ్ఛతోడను ఇప్పుడీ సంపుటీకరణ మావశ్యకమయ్యెను.

కథల యందలి పాత్రలన్నియు కల్పితములు. మానవ ప్రకృతి నుద్దీపింపజేయున ట్లుద్దేశింపబడుటచే సహజముగా నాత్మోపగూహన మెవ్వరికిని సాధ్యము కాదు.

వేఱొక యంశమేమన నీ కథలయందలి నాయకులుగాని తదితర పాత్రలుగాని సమగ్రులగు వ్యక్తులు గారు. పాశ్చాత్య విమర్శకదృష్టి దీని నెంతేని బలపఱచుచుండగా ప్రాచ్యధోరణిలో నేల నకలు నాయకులను నాయికలను సృష్టింపవలెనని యిట్లు గావించితిమి. ఇందలి యౌచిత్యము నిర్ణయించుపని పఠితృలోకమునకే వదలితిమి.

ఇందలి భాషయు సర్వజనులకు నభ్యస్తమగు వ్యావహారికమేగాని గ్రాంథికము గాదు. ఎడనెడ నుచ్చమగు శైలి యున్నచో నది భావతీవ్రతను బట్టి యనుసంధింపబడినది గాన

ప్రశస్తమే యగునని నమ్మితిమి. ఎట్లన స్వర్ణకారు డెల్ల ప్పుడు స్వర్ణమునే వాడినను అందందు అలంకారశోభకై వజ్రముక్తామణులనుగూడ వినియోగించునుగదా !

ఇక నీ గ్రంథమున గల లోపములను చంద్రునిలోని మచ్చలుగా భావించి యిందలి రసము నాస్వాదించి మా కృషి ఫలప్రదము గావింతురని యాశించుచున్నాము.

సంపాదకుడు
కళాకల్లోలినీ గ్రంథమాల

# అంకితము

అస్మజ్జనకుడు శ్రీ శివస్వామి సోమయాజికి—

నను ప్రేమించిన తండ్రివై నగడి తన్యాయం బాకింతే నెరుం
గని నిష్పాక్షిక శిక్షణాగురుడవై గణ్యుండవై తిద్దరన్
అనలోగ్రంబును చందనోపమును నీదౌ శీలమున్ స్వాంతమున్
వినుతింపంగ కుతూహలంబగు భవద్వృత్తాంతమున్ హేపితా!

గతకాలంబున నీవు నా పయి మహోగ్రక్రూర కోపానలం
బతిరేకంబుగ జూప నొక్కపరి నే నాత్మన్ విరోధించి దూ
రతరంబై విలసిల్లు సింహపురి చేరంబోవగా నీవు నా
గతి యేమయ్యెనో యంచు బెగ్గడిలవా కారుణ్యముప్పొంగగన్.

ఆ వృత్తాంతము నేడు నా మనసులో వ్యావర్తనల్ చెందగా
నేవో కొన్ని సగూఢ భావములు రేకెత్తంగ నే డొక్క కృ
త్యావిష్కారము చేయంగోరినది మత్సారస్వతప్రౌఢి యే
శేవన్ దీని జయావసాయిగను తండ్రీ! చేతువో తెల్పవే.

నేటి కాలాన నన్వేషింప లే డొక్క
కవిసత్తముడు పూర్వకవుల బోలి
కలవారిలోన పెక్కండ్రొక్క కృతిమాత్ర
మునకె పేరెన్నిక కనదలంతురి
రసవంతమై వాగ్విలసనం బొనర్చు స
త్కృతి వినిర్మించు వారెందు నరిది

బహుళంబుగా జనుల్ పఠియించు నట్టివి
కథలుకాక్కితర మెక్కడవి కలుగు

కాన వచియింపబూనితి ఘనతర ప్ర
సన్న వదనుండవై నీవు విన్న యెడల
సత్కథలు కొన్ని నీ కిదె సాగి మ్రొక్కి
శ్రీ శివస్వామి సోమయాజీ ! జనకుడ !

దీని గ్రహియింపుమయ్య ప్రీతిమెయి జనక !
సకలదిగ్వ్యాపిత స్వచ్ఛ సాంద్రకీర్తి !
నవ్య నీరేజధామ వినగ్నమూర్తి !
నీ యనుగు బిడ్డడిచ్చు నుపాయనమ్ము.

# కథావళి

## అపవాద భీతి

( శ్రీముఖ : మాఘము )

భానుమూర్తి గంగాధరంగారి రెండో అబ్బాయి. పెద్దవాడు బందర్లో ఎఫ్. ఎ. తరగతిలో జేరి నెల్లాళ్లయింది. ఇతన్ని ఏం చేయించడానికి ఆయనకు నిశ్చయం కుదరలేదు. ఆ రోజుల్లో ఇంకా ఉద్యోగాలయందలి నిరాశ దేశంలో ప్రబలలేదుగాని, ఎందుచేతనో గంగాధరంగారు హూణవిద్య యెడల తీవ్రమగు వైముఖ్యము చూపేవారు. ఆయన చదివినది నాల్గవఫారంవరకే అయినా ఆ లోకజ్ఞానము, ఆ దూరదృష్టి ఎమ్. ఎ. ప్యాసయిన వాళ్లకుగూడా ఉండదనటంలో ఏమీ అతిశయోక్తి లేదు. హూణవిద్యా సంపర్కంవల్ల దేశీయ విజ్ఞానం, దేశీయ నాగరికత నానాటి కథోగతిపాలవటం ఆయన పరిశీలనాదృష్టికి సులభగ్రాహ్యము. ఇన్నీ తెలిసీ కూడా, తన పైయధికారులైన ఓవర్సీర్లు, ఇంజనీర్లు, బి. ఏ. లు బి. యిలు ప్యాసయి దోసిళ్లతో డబ్బు సంపాదిస్తున్న సంగతి కళ్లార చూస్తున్న యీ బ్రాహ్మణ సంసారి తన పెద్ద కొడుకును కళాశాలలో జేర్పించి చదివించకుండా యెట్లుండగలడు?

తన తండ్రి పేరుమోగిన. పౌరాణికుడు. పెత్తండ్రి జగమెరిగిన సాంగవేదవేది. తాత హావిర్యాజి. తత్సాంప్రదాయ ప్రతిభ వెనుకటి తరంవాళ్లు అక్కడక్కడ చెదరి మిగిలిన వాళ్లు నేటికి వేనోళ్ళ బొగడుదురే! అట్టి సంప్రదాయము కాదని తన యిర్వురు కొడుకులను ఈ క్రైస్తవ కళాశాలలకు బంపి వంశ విభ్రంశము చేసికొనుటకు గంగాధరంగారి అంతరాత్మ ఎంత మాత్రం ఒప్పుకోలేదు. సరే యిక పెద్ద వాడి సంగతి అయిపోయింది. రెండోవాణ్ణి సంస్కృతం, స్మార్తం చెప్పించి వైదికంలో గట్టివాణ్ణి చేద్దామని నిశ్చయిం చుకున్నాడు. తన నిశ్చయం భార్యకు తెలియజేసాడు.

" ఏం? వాడు ఎఫ్. ఏలు, ఎమ్. ఏలు ప్యాసయి ఊళ్లేలుతుంటే, పౌరోహిత్యం చేసుకుంటూ ఊరూర తిరగ టానికి వీడి ఖర్మం నా ఖర్మం ఏం కాలింది. వీడంటేనూ వీడి చదువంటేనూ మొదట్నుంచీ మీకు అశ్రద్ధే లెస్తురూ" అన్నది భార్య గుమ్మానికి జేర్లబడి కూర్చుండి. తనకు భానుమూర్తి మీద పక్షపాతం కాబట్టి పెనిమిటికి పెద్దకొడుకు మీద మక్కువ యెక్కువన్నట్టు లారోపించుకొని ఆమె అప్పుడప్పు డిలా రేగుతూ వుంటుంది. కాని వివేకి యగు గంగాధరంగారికి కన్న కొడుకు లిద్దరిలో ఎక్కువ తక్కువ లుంటాయా?

"ఆడజాతి!" అని లోపల అనుకొని ఊరుకుండేవా డాయన. భార్య ధోరణి చూస్తే భానుమూర్తికి ఆంగ్ల విద్య చెప్పిస్తేనేకాని వీల్లేదని పట్టుబట్టేటట్టుంది. లౌకికుడైన గంగాధరం భార్యతో వితండవాదానికి కూర్చోక, "అబ్బే,

ఎందుకు ; రెండేళ్ళయేటప్పటికి సంస్కృత జ్ఞానం స్ఫుటంగా కలుగుతుంది. వెంటనే ఉన్నత పాఠశాలలో జేర్పిద్దాం. ఇల్లాంటి పురాణవిద్యలు పద్యాలుగు నేరుస్తాడు మన అబ్బాయి రెండు రోజుల్లో. సంస్కృతమనే కల్పతరువుంటే రాని భాషేమిటి ?" అని ఆమెను ఒప్పించి బల్లమీది పంచాంగం తీసిచూచి "మర్నాడు ఉదయం ఆరూ, ఆరున్నర గంటలకు దివ్యంగా వుంది ప్రయాణానికి" అన్నాడు.

తెల్లవారుఝామునే లేచి తల్లి భానుమూర్తికి తలంటి నీళ్ళోసి చద్దన్నంపెట్టి పండక్కి చేసిన లడ్డూలు నాలుగు రుమాలు కొంగున మూటకట్టి యిచ్చి "పడవలో ఆకలేస్తే తిను నాన్నా" అని చెప్పి, దొడ్డిదోవని వెళ్ళి వీధి దోవని ఎదురుగుండా వచ్చి, 'శకునం మంచిది' అనిపించి 'కాలవ... జాగ్రత్త' అని మళ్ళీ మళ్ళీ చెప్పి వెనక్కి దిగడ్డది.

గంగాధరంగారు భానుని పడ వెక్కించి, సరంగుకి కేవు డబ్బు లిచ్చి, 'మా అబ్బాయిని గొల్లపాలెం సులో బీలో దింపవయ్యా' అని చెప్పి, జాగ్రత్తగా వెళ్ళమని భానుతో రెండు మూడు సార్లు చెప్పి పడవనూ పిల్లాణ్ణీ సాగనంపి వచ్చారు.

## 2

పార్వతి జానకిరామయ్యగారి మొదటి భార్యా పెద్ద కూతురు. రెండో భార్యా కాపరానికి వచ్చి నాలుగేళ్ళు దాటిందిగాని ఇంకా ఆమెకు సంతానం లేదు. ఆమె కెప్పుడూ

గాలనో ధూళనో అస్వస్థతగానే యుంటుంది. ఆమెను చూస్తే భయమేస్తుంది. ఎప్పుడూ అన్యప్రపంచంలో వున్నట్టే మాట్లాడుతుంది. సంవత్సరంలో ఆరునెల్లు పుట్టింటిదగ్గరే వుంటుంది. ఈ ఆరు నెల్లూ యింటో పెత్తనం పార్వతిది. చెల్లెలిచేత చెప్పి చేయించుగున్నా, తండ్రికి పనులు పురమాయించినా, పాలేర్లపై అధికారం చలాయించినా, ఏం చేసినా యీ ఆర్నెల్లే. అది ఆమెకు శుక్లపక్షము.

ఆమె యౌవనరాగము ఆమె ప్రతి అంగమునందే కాక, ఆమె చేసే ప్రతి పనిలోనూ, ఆడే ప్రతి మాటలోనూ, చూసే ప్రతి చూపులోనూ ప్రసరిస్తుంది. రసప్లావితమగు నీ ఫలము నేమూఢుడు ' నా హక్కు ' అను పాశముచే బిగించి బిగించి మందమతియై త్వర త్వరగా రసహీన మొనర్చునోగదా! ఇంత మహానందముతో, ఇంత నూతనోత్తేజముతో ప్రారంభమగు నీ యౌవనమును సంసారమను సంధకూపమున బడవైచి మనసుకుగాని దృష్టికిగాని విశాలత యనునది కనబడనీయక తుద కాయుస్సుగూడ కుదించి దేశదౌర్భాగ్యమునకు కారకు లగుదురే! వీరట, సంఘము నాదేశించువారట, పురోహితులట!

భానుమూర్తికి జానకిరామయ్యగారు సంస్కృతం చెబుతారు. ఇంకో ఆయన స్మార్తం చెబుతాడు నిద్దరపోతూ, నీళ్ళు నములుతూను. భోజనం వారాలు చేసుకుని,—వాళ్ళ చుట్టమే ఒకాయన కుదిర్చాడు ఏడురోజులూ తనింటిమీదే

పడతాడేమోనన్న భయంచేత. ఉండటం జానకి రామయ్యగారింటోనే.

ఇరువురు గురువుల మధ్యనూ అతని పని తిరగటి రాళ్ళ సందున బడ్డట్టైంది. స్మార్తం గురువుగారు చెప్పే పావుగంట సంత భాగ్యానికి రోజుకి పదిగంటలు పని చేయించుగుంటారు వాళ్ళింటో. పైగా చీదరింపులు, కస్సుమనటాలూను. ఆ గురువుగారింటో తన హృదయాన్నెంత పొడిచి పొడిచి పంపించినా ఈ గురువుగారింటివద్ద పార్వతిని చూడడంతోటే అతని గుండె జీవం పోసుగుండేది. మబ్బు కన్నియ పర్వతేందు్రని తాకున వర్షాంబువుల గురియునట్టులా యువతి దృక్కులు భానుమూర్తి పై ప్రేమధారలను గురిసె. ఆ స్నిగ్ధ కపోల శిర సాకించుక వా్రలెను. గొంతు సన్నగిలెను. ఆ అధికార వాక్కులలోనే ప్రేమ యొలుకుచుండెను.

## 3

అవి పార్వతికి శుక్లపక్ష దినములు. ఇప్పుడు భానుమూర్తి వారానికి నాలుగు రోజులు జానకిరామయ్యగారియింటోనే భోజనం. ఈ సంగతి జానకిరామయ్యగారికి తెలుసునో తెలియదో కూడా. ఆ గురువుగారింటికి వెళ్ళటం తగ్గించేసాడు. కాని అతనిది జదువు బ్రతుకైంది. అయినప్పటికీ, అతని కష్టాలన్నీ మాయగొట్టుటకు పార్వతి ప్రేమ వాక్యొకటిచాలు. సుఖ దుఃఖ సమ్మేళనం భగవన్నిర్ణయం. వారం వారానికి తలంటిపోసుకుంటేనే గాని పీల్లేదని బలవంత

పెడుతోంది పార్వతి విద్యార్థిని. ఇప్పుడిప్పుడు తానే తలంటు తోంది. కంట్లోకి నూనెపోతే పయిటకొంగుతో అద్దేది— ఇటూ అటూ తలెత్తి చూస్తూ. ఆ క్షణములలో భాను మూర్తికి కలిగే గగుర్పాటు, ముఖవికాసం పార్వతి గ్రహిం పక పోలేదు.

అతనికి కలిగే మనస్సంరంభం చేష్టలలోకిగూడా పరిణ మిస్తూనే వుంది. జానకిరామయ్యగారి దగ్గర శ్లోకం చదువు తున్నప్పుడు ఇదివరకుండే శ్రద్ధ యిప్పుడు కనబడటం లేదు. పరధ్యాస ఎక్కువైంది. గురువుగారొక్కసారి చెప్పగానే యిదివరకు పాఠం వచ్చేది. అల్లాంటి దిప్పుడు నాలుగైదు సార్లు చెప్పించుకోవలసి వస్తోంది.

అతని మనస్సులో ఇంత భావ సంచలనం కలుగు తున్నా అతడు మూగయే. పెదవి కదిపి మాటాడలేదు. అతనిలో ఇప్పుడిప్పుడే నవయౌవనం తొలకరిస్తూ వుంది. కాని, ప్రహ్లాదునకు మాతృగర్భము నందే భక్త్యావేశము లొంటబట్టినట్లు, భానుమూర్తికి ప్రేమావేశము లాజన్మసిద్ధ ములు. పార్వతీ దర్శనం, పార్వతీ క్రియాకలాపం తనకు మహా నందం కలిగిస్తున్నాయి. కాని పార్వతీ హృదయము నెడల తనకు నమ్మకం, ధైర్యం చిక్కలేదు. దిన దిన మాతని మనస్సులో నూతన పరివర్తనం కనబడుతోంది. ఇమ్మహా ప్రేమానుభవంవల్ల అతనిలో కలిగే విజ్ఞానం రఘువంశంవంటి కావ్యాలు వెయ్యి చదివినా కలుగుతుందా అనిపించింది భానుమూర్తికి. ఎల్లా, పార్వతి హృదయంలో వుందో తెలు

నుకోటం ఎల్లా అనే సమస్య ఇరవై నాలుగ్గంటలూ అతని మనస్సు నాందోళన పరుస్తోంది. ఒంటరిగా నున్నప్పుడు మర్మం విడిచి పార్వతిని అడుగుదామని లక్ష్మీసార్లనుకున్నాడు. కాని లక్ష్మీసార్లూ నోరువిప్పి మాట్లాడలేక పోయాడు. నాలుక తుదకు వచ్చీకూడా అడుగలేక మాటమార్చి మాట్లాడాడు. పార్వతి తనను ప్రేమిస్తోందా లేదా? పార్వతియెడ తనకు గలిగే ప్రేమ పాపభూయిష్ఠమా లేక పవిత్రతాయుతమా? పవిత్రమైనచో నది బహిర్గతి మొనర్చుటెట్లు? ఇదే స్మరణ భానుమూర్తికి, పాపం!

లక్ష్మిపై ఒకటోసారి అది. ఈ పర్యాయం తప్పకుండా అడిగి తీరుదామనుకున్నాడు. పార్వతి నడవాలో చిర్నాప మీద ఉత్తరపువైపు గోడనానుకుని కూర్చుండి మల్లెపూలు దండలుగా గుచ్చుకుంటోంది సాయంత్రం నాలుగ్గంటలవేళ. భానుమూర్తి బల్లదగ్గర నుంచున్నాడు. ఇంకో నిమిషందాకా ఒండొరుల హృదయాల్లో ఏమున్నదీ తెలియబోదు. దాని మాటట ఏం జరుగనున్నదీ అంతకన్నా తెలియదు పాపమా ముగ్ధహృదయులకు! భానుమూర్తి పార్వతివైపు తిరిగాడు. పార్వతి కనురెప్ప లొకసారి యెత్తి మరల వాల్చినది యెంతో కష్టంతో అమృతమాహారించినవోయనగా.

భానుమూర్తి రెండడుగులు ముందుకు వేసాడు. పార్వతి అధరముపై చిరునవ్వు తొలకరించినది. ఆమెకు అర్థమౌతూ వౌతూవుంది పరిస్థితి. కాని వ్యవధిలేదు. ప్రేమభరంచేత కుంగిన శరీరంతో ఆమెపైవాల నుంకించి, ముగ్ధుడై, పసి

వానివలె పార్వతిచాచిన చేతులలోకి ఒరగినాడు. పార్వతి చేతనున్న పూలు జలజల రాలినవి తత్ప్రియుని మూర్ధము పైన. గుచ్చిన పూలచెండు చేతికిచ్చినది. భానుమూర్తి చెలి కేలు తన యరచేతులమధ్యపెట్టి ఆమె కంపించు కెమ్మో విపై, చిఱునవ్వు నేత్రాలపై, చూపు నిలిపి, "పార్వతి! పార్వతి !...నీ...నీ" అని ఏదో అనబోతున్నాడు. సాయం సంధ్యాకాంతుల మెరసిపోవు నా నూత్న ప్రియులపై అంత లోకే నీడవాలినది. ఒక్క సెకండు. ఒక్క సెకండు భాను మూర్తి హృదయంలో నొప్పి...తాళ్లువేసి గుంజి గుండె లాగి నట్టు...అవి మనుష్య దృక్పాశములు కిటికీ ఊచల్లోంచి. కిటికీప్రక్కనుండి వ్యక్తి తూర్పుముఖంగా నడచినాడు.

భానుమూర్తి తలెత్తి చూసాడు.

'బాబోయ్ !'

'ఎవరు వారు ?'

'గురువుగారే !'

పార్వతి చివాలున లేచి పడమటింటి తలుపు తీసికొని దొడ్లోకి వెళ్ళింది.

## 4

'ఏంచేస్తున్నా వప్పట్నుంచీ ?'

'ఇప్పుడే వచ్చాను, పెట్టె సర్దుకుంటున్నాను !'

'పొలంలోకి రమ్మంటినిగా; రానేలేదేం ?'

'ఆ చేతిలో పుస్తకమేమిటి ?'

'శృంగారనైషధం !'

'అప్పుడే నీకు శృంగారం కావలసివచ్చిందేం?'

నాటిరాత్రి భానుమూర్తి భోజనంచేసి లేచాడన్న మాటేగాని తిన్నదికాస్తా నీళ్ళుగారిపోయింది. రఘువంశంపుచ్చు కుని దీపందగ్గర పది గంటలదాకా కూర్చున్నాడుగురువుగారు వచ్చి పాఠం చెబుతారేమోనని. గురువుగారువచ్చి వాకిట్లో నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్నారు. ఆ ప్రతిమాటా తన మీద నేరాన్నే నిరూపిస్తున్నట్టు అతని చెవుల్లో, అతని హృద యంలో మోగుతున్నాయి. చలి, సూదులెట్టి పొడుస్తున్నట్టు వేస్తోంది. దానికితోడు గురువాక్కులు శూలాలల్లే పొడుచు కుంటున్నాయి. గురువుగారి కంఠస్వరమే దుర్భరమయిపోయిం దతనికి. కూర్చుని కూర్చుని ప్రాణం విసిగిపోయిం దతనికి. ఎట్టకేలకు గురువుగారు సంభాషణ చాలించి ఇంట్లోకి వచ్చారు. వచ్చి, "పాఠం లేదు, బగ్గీలేదు, పోయి పడుకో అరుగుమీద" అన్నాడు కర్ణకఠోరస్వరంతో. అని భాను మూర్తి ఇంకా తిన్నగా గుమ్మం దాటాడో లేదో, పక్క బట్టలు తీసుకున్నాడో లేదో అన్న ఆలోచనగూడా లేకుం డానే, తలుపువేసేసి పోయి పడుకున్నాడు. ఆ నిర్దాక్షిణ్యాం చూస్తే ఎంత తాల్మి కలవానికైనా ఆ సమయంలో కోపం రాకమానదు. ఎప్పుడూ భానుమూర్తిని నడవాలో పడుకో

మనే గురువుగారు అవ్వాళ అరుగుమీద పడుకోమన్నారు. ఆ క్షణంలో తన హృదయం చితికి ఆగి చచ్చిపోతాననే అనుకున్నాడు భానుమూర్తి. కాని విధిక్రమం అది కాదుగా.

భానుమూర్తి పైబట్ట ముసుగు వేసుకొని పడుకున్నాడరుగుపై కటిక చాపమీద. కాని నిద్రపట్టనే లేదు. పన్నెండైంది, ఒంటిగంటైంది. కాని రెప్పమీద కునుకేలేదు. లేచి కూర్చున్నాడు. ఆలోచనలో తల దిమ్మెత్తిపోయియుంది. కళ్ళు పొడుచుకున్నా కనబడనంత గాఢాంధకారం. పైన దట్టముగ మబ్బులు. లేచాడు. అరుగుమీదనుంచి క్రిందకు దిగాడు. వీధిలోకి వచ్చాడు. చినుకులు పడుతున్నాయి. అంతలో కుక్క మొరిగింది. ఒక నిముసం నిలబడ్డాడు తన్నుదా బిట్టుగ కౌగలించుకొని. అది బహిః ప్రపంచము.

అంతరాలోచన ప్రపంచము అతని మెదడేకాక, శిరస్సేకాక యావచ్ఛరీరాన్ని ఆవరిస్తూ, అప్పటికీ చోటు చాలక అతనిని ఛేదించుకొని బహిఃప్రపంచముతో ఐక్యమయి పోవాలని చూస్తోంది. మృత్యుముఖాని కీడుస్తోందా నవ యౌవనుణ్ణి నిర్దయతో.

తాను చేసిన ఘోర పాపమునకు ప్రాయశ్చిత్తము మరణమే యని యాతని మనస్సాతని హృదయాన్ని పట్టు బలవంతాన ఒప్పిస్తోంది. పాప పుణ్యాల మాటటుండగా మర్నాడు ఊళ్ళో తలెత్తుకు తిరుగుట యెట్లు? అందరితో

చెప్పి అల్లరి చేస్తాడేమో గురువుగారు. వాళ్ళ ఊరు వచ్చి వాళ్ళ నాన్నతో చెబుతాడేమో! ఇక దేశమంతా పాకి పోతుంది. ఈ అల్లరి భరించడం కష్టం.

ఒక అడుగు ముందుకు వేసే కాలంలో అతని మనస్సులో ఇన్ని ఆలోచనలొక్కసారిగా పొడముతున్నాయి. ఆ కటిక చీకట్లో, ఆ జడివానలో నడచి ఊరు వెలుపలికి చేరుకొన్నాడు. అతని నిశ్చితోద్దేశమేదో లేకపోలేదు. దానిచుట్టు మూగుచున్న యితరాలోచనలు మాత్రమే పై వాళ్ళకు తెలుస్తున్నాయి.

ళ్ళలోనూ బురదలోనూ పడుతూ లేస్తూ ఉప్పుటేటి గట్టు చేరుకున్నాడక్కణ్ణించీ. తన్నెవరో తరుముకు వస్తున్నారనే అతని భయం. ఏరు నిండా గర్భంగా వచ్చింది; చూసేటప్పటికి భానుమూర్తికి వెఱ్ఱెత్తింది. ఏదో వెర్రినవ్వు నవ్వి అక్కడి మర్రిచెట్టు మొదట్లో కోటరాన దూరాడు. దూరిన వ్యవస్థ లేకుండా ఏదో కాలిమడమను పళ్ళతో పట్టి కరచి పీకింది. కాలు విదల్చి చేతితో తడుముకుంటూ ఇవతలికి వచ్చాడు. చేతికి నునుపుగా తగిలింది. వర్షం కురుస్తూనే ఉంది. ఆ వర్షములోనే భానుమూర్తికి తాపం, దాహం, నిదాఘం. ఉన్మాది అయాడు. బాధ దుర్భరమైంది. మనస్సు చలిస్తోంది. కాని పార్వతి మరపు రాలేదు. ఆకంపించు కెమ్మోవితో, చిరునవ్వు నేత్రాలతో, చాచిన చేతులతో ఆ గాఢాంధకారములో మెరుస్తూ అతని

కళ్ళకు కనబడుతోంది. "రమ్మ, రమ్మ", అని సైగ చేస్తోంది. ముందుకు నడుస్తున్నాడు అలా బాధపడుతూనే, "పార్వతి, పార్వతి...నీ...నీ..." అంటూనే. ఇంకో అడుగు ముందుకు వేస్తే సమాప్తి. అది మహాప్రవాహము. పాపం, జలాంతర్గత యగు పార్వతియే అతనికి కనబడుతోందిగాని నిశాతదంష్ట్రా కరాళమైన మృత్యుగహ్వార మా దృష్టికి కనబడటం లేదు.



# కథావళి

## సిద్ధాన్నము

ఆ భూములు మధురములైన గోదావరీ జలముల నేటేటా దాళ్వులచే సారవంతములు. నదీతటమునసే పెద్ద గోపురము, దేవాలయమునుగలవు. ప్రాతర్వేళల నా గోపుర పురోభాగముననిల్చి గోదావర్యంతరమున నరుణ బింబమును తత్కిరణ ప్రసరణమును చూచిన ఆ వెలుగుల యరుణిమ, ఆ ప్రవాహపు నీలిమ కలిసి యేదో క్రొత్త వర్ణము గోచర మగును. కొన్ని యేండ్ల క్రిందట గోదావరి వరదలు వచ్చి నప్పుడు నీరీ దేవాలయపు మట్టమునకు వచ్చినదట. అంతకును మించి యెత్తైన కట్టగలదు. సాధారణముగా నదీమతల్లి దానిని మీరిరాదు. మీరినచో, ప్రక్క జనపదములగతి? జగద్భర్త కెఱుక !

ఆ కట్ట దాటి వచ్చితిమి. కనబడున దొక కాలువ. అక్కడే లాకు. ఎత్తునుండి పల్లమునకు పడు నీటిమోత. కాలువ యొడ్డంతయు చెల్లే. గోదావరికట్టనెక్కి చూపు పర పితిమా ఆ దృశ్యము భూదేవీ మంజుల కేశాగ్రభాగ సౌగంధి కము. పంట తయారైన బంగారు వర్ణపు వరిచేలు. అటునటు

కొబ్బరి తోటలు, చెరుకుతోటలు. ఆ కాలువదాటి ప్రభుత్వపు కంకరరోడ్డుబట్టి నడచి యిరు కెలకుల గల దుకాణముల జూచికొనుచు ఒక్క ఫర్లాంగుదూరము వచ్చితిమా ఆ గ్రామ మధ్యమున నుందుము. అక్కడ ఎడమచేతివైపు బజారుకేసి మళ్లి రెండు ఫర్లాంగులు నడచితిమా, అది ఊరుకొక దరి. అక్కడనున్నది పెళ్లివారి యిల్లు.

వీధి నావరించిన పందిరి. పందిరిక్రింద బాలురు నాలుగు స్తంభాల ఆట ఆడుకొనుచున్నారు. అరుగులపై బాలికలు తాటాకు బొమ్మలపెళ్లిళ్ళు జరుపుతున్నారు. చంకలోనిబిడ్డ క్రిందకు జారుచుండ పైకి జరుపుకొనుచు 'అమ్మా! బిచ్చమెట్టు తల్లీ!' అని అరచుచున్న భిక్షుకురాలు ఆ కోలాహలమున నాలకించువారు లేక వాకిట నల్లే యరచుచున్నది.

వరుసనే వచ్చినిల్చిన బళ్ళలోనుండి మగ పెళ్లివారు దిగినారు. పల్లకిలోనుండి పెండ్లికొడుకు దిగినాడు. అందరినీ విడిదిలోకి చేర్చినారు. పెండ్లికొడుకు తల్లినీ అప్పగారినీ పరామర్శించి తీసుకొనిపోయి తమ యిల్లూ దొడ్డీ చూపించి బంధువులకు పరిచయం చేసినాడు పెండ్లికూతురు అన్నగారు. ఇంటికి ప్రక్కనే మామిడితోట ఒకటున్నది. చెట్లు ఆవరణకు చుట్టూ దగ్గర దగ్గరగానే ఉండి ఆవరించియున్నవి గాని మధ్యలో మాత్రం కొంత వైశాల్యం ఖాళీగ వుంది. అక్కడ ఒక చింతచెట్టు ఉంది. దాని కొమ్మకు లావుపాటి మోకుతో ఊయల వేసి ఉంది.

నాకు బాగుగా జ్ఞాపకము. నా కప్పుడు పదేండ్లుండు నేమో! ఆ తోటలోనికి నను దోడ్కొనిపోయినా రాకన్నియ లిరువురును. దరవికసిత హృదయలు. ఆననేందు దరహాస కౌముదుల నన్నార్ద్రితరునిగ, ఒక రసవాహినిగ నొనర్చిరి. ఆ హాసంపు కెరటముల ధ్వనులు నేటికి నా శ్రుతిపుటముల రుతించు. ముగ్ధుడను. విభ్రాంతుడను, గంజితుడను, గోదావరీ కుల్యను. వారి హస్తవల్లరుల కెట్లందుదు ? ఊయెలకు చెరి యొక వైపున నిలువబడి చెరి యొక త్రాడునుబట్టి 'ఊపెద మూగుదువు గాని' యనిరి. 'వలదు నాకు భయ' మంటిని.

ఆహాసంపు కెరటముల ధ్వనులు తోటను తరంగిత మొనర్చె. పక్షుల కిలకిలలు మాకు తూణీరములు. ప్రక్కల నిలబడి చూచు నరిపేదల బాలబాలికలు, దిగంబరులు, వివృతకేశులు మా పెండ్లికి సాక్షులు. నా లోచన గోళము లా దృశ్యమును మ్రింగెనో ఆ దృశ్యము నా లోచన గోళ ముల భేదించెనో! కన్నియలు; సాభినయలు; అప్స రస్సల్లెంద్రు; వత్సరద్వయమాత్ర వయోభిన్నలు; ముగ్ధ చిత్తలు; స్నిగ్ధమూర్తులు; ఖేచరలు.

'భయములేదు, ఊపెద' మనిరి.

'వలదు, నాకు భయ' మంటిని.

పెద్ద యామె, 'నే నూయలపై గూరుచుందును. నా వెనుక పద్మ నిలబడును. నా యొడిలో నీవు. ఊగుదమా?' యనెను.

'మరి నన్ను గట్టిగ బట్టుకొందువా?' అంటిని.

'భయము లేదు' అన్నది ఆమె.

ఊగితిమి.

నిర్భరానంద డోలికల నూగితిమి.

అర్ధవర్తులాకృతి వచ్చుదనుక నూగితిమి.

చింత చివురులు తాకు దనుక నూగితిమి.

అనిలకల్లోల లాఘవముల నేలితిమి.

బాలబాలికలు సాక్షులుగారో, పక్షిరావములు, హృదయజలజస్రుత మధువులు, లోచనగోళస్రుత వారి బిందువులు, తరంగిత వనప్రభలు, పల్లవిత భావవల్లరులు, సరళిత వాక్సురభులు, ఆ మా పెండ్లి కామోద సూచనలు కావో! నేటికి వంచితుడను. ప్రలాపిని. ఉన్మాదిని. ఒక ప్రేయసి ఇంద్రసభ వీడిరాదు. రెండవ యామె తన కోమలతను, తన సౌహార్దతను, తన ప్రేమను అంతరాంతరముల డాచి, చుట్టు నేడుకోటల గట్టి, దుష్టుల గాపువెట్టి, నను దరి జేరనీయదు. ప్రేయసి! నేటికి హృదయరహిత. వంచకురాలు. ప్రాపంచిక. మరచిరి. వారిరువురును మరచిరి. నన్ను పెండ్లాడిన మాటయే మరచిరి— పదేండ్ల ప్రాయము నాడు నా లేత హృదయము నపహరించి యీ కట్టెనిట వీడి నేడు తామెటనో కులుకుదురు— కోమలులు! నిర్లజ్జలు! నిరభిమానలు!

## 2

పెండ్లివారు వచ్చినారు. వంటలు త్వరగా కావలెనని అంతా పరువులెత్తుతున్నారు. "పెండ్లి కొడుకు బాగానే ఉంటాడు. అంత మెరుపూకాదు. అంత నలుపూకాదు. చామనచాయ. ఇంతకూ బుద్ధిమంతుడు. చదువుకున్నవాడు. సాంప్రదాయం మంచిది. అదీ కావలసింది" అని పున్నమ్మ యను పొరుగింటావిడ పెండ్లికూతురు తల్లితో మంచిమాట చేసుకుంటోంది.

'ఇంతకు పెద్దమ్మాయినా, చిన్నమ్మాయినా ఇవ్వటం?' అంటోంది ఒక అత్తింటి కొత్తకోడలు.

'ఎవర్నిచ్చినా రెండేళ్లేగా వార. అందుకని పెద్దదాన్నే యిస్తున్నారు' అంది ఒక తెలిసిన తేట.

'ఎందుకని?—మేము చేసుకుంటే రెండో దాన్నే చేసుకుంటామని కబురు పంపించారుగా పెండ్లికొడుకుతండ్రి?'

'నిజమే. కాని పెద్దదాన్ని విడిచి రెండో దానికి ముందు చెయ్యకూడదుగా? అందుకని పోనీ యింకో సంబంధం వస్తే యిద్దరికీ ఒక్కసారే చేసివెయ్యొచ్చునని చూస్తే యెవరొస్తారింత తొందర్లో. మగపెళ్ళివారే తొందరపడటం చేత సందర్భాన్నిబట్టి పెండ్లికొడుకు తండ్రి పెద్దమ్మాయినే తన కొడుక్కు చేసుకోవటాని కిష్టపడ్డాడు.'

పెండ్లి అయిదు రోజులూ బాలబాలికలకు, యువతీ యువకులకు, స్త్రీ పురుషులకు అందరకు మరపునకురాని సుఖమై కడచినవి. కాని రావలసిన పెండ్లితగవు తప్పింది కాదు. భోజనాలవద్ద మగపెండ్లివారి కందరికి పీటలు సరఫరా చెయ్యలేక ఆడపెండ్లివారు, పెండ్లికొడుకు తండ్రికీ, పెద్దవాడయిన ఆయన అన్నగారికి మాత్రం వేసి తక్కిన వారికి చక్కని నేల చూపించారు. పెండ్లికొడుకు పినతండ్రికి పట్టరాని కోపంవచ్చి, 'వేస్తే పీటలు అందరికీ వెయ్యాలి, మానితే అందరికీ మానాలి, అంతేగాని యీ అల్పవిషయంలో ఇంత భేదబుద్ధి చూపించడం చాలా గర్హ్యం!' అని చెప్పి వడ్డించిన విస్తరిముందర్నుంచిలేచి చెంబూ నీళ్ళు పారబోసి ఇంకా నలుగురు తన వెంట లేవగా వారినిగూడా తీసుకుని పోబోయినాడు. వెంటనే పెండ్లికూతురు అన్నగారువచ్చి, 'మామగారూ! ఆగ్రహిస్తే నిలవలేం. మీరు మా మాట గూడా కొంచెం వినాలి. పీటలకోసం పంపించాం. రెండు నిముషాల్లో వస్తున్నాయి' అన్నాడు.

'చాల్లెండి, తూర్పువా రనిపించారు. అసలు మీకు పీటలువేసే ఉద్దేశ్యమే లేకపోయిందని ఒప్పుకోక ఎందు కిలా తప్పుగుంటారు? ముఖ్యంగా అన్నదమ్ములయిన వాళ్ళలో మీ రిలా వ్యత్యాసం చూపించడం గొప్ప పొరపాటు. ఇంకా మీకు తెలియదేమో ననుకున్నాను. తెలిసికూడా ఇలాంటిది జరిగిందంటే నమ్మలేకుండా ఉన్నాను' అన్నాడు.

'అయిపోయింది. అయిందేదో అయింది. క్షమించి నీరావు విస్తరిముందుకు దయచెయ్యాలి' అని సేనానాయకుణ్ణి కూర్చోబెట్టేటప్పటికి పరివారంకూడా వాళ్ళ వాళ్ళ విస్తళ్ళ ముందు కూర్చుని ఆఖరికి పీటల్లేకుండానే భోజనం చేసి లేచారు.

ఈ ఒక్క కీచులాటా తప్ప మరే యితరమూ రాక పోవటంచేత పెండ్లి బాగానే జరిగిందని అంతా అనుకున్నారు.

## 3

పది పన్నెండేళ్ళ క్రిందట వచ్చిన తుపానుగాలికి ఏలూరు బస్తీ బస్తీ అంతా అల్లకల్లోలమయిపోయింది. ఇరు ప్రక్కలనున్న చెట్ల కొమ్మలూ విరిగి పడి రాజమార్గము భూజ మార్గమయిపోయింది. తెల్లవారేటప్పటికి గాలి దుమారం, వాన తగ్గి, అల్లాగే రోడ్డుమీది ఆ చిట్టడవిలో నుండి చిన్న కాలిబాటను చేసుకొని జనులు నడిచిపో తున్నారు. క్రొత్తగా కట్టిన సిసీమాహాలు గోడ విరిగి పడి లోపల తలదాచుకున్న ఉప్పరుల పిల్లలు, స్త్రీలు, పురు షులు మంటికింద రాళ్ళక్రింద కప్పవడి అర్థాయుష్కులు దుర్మరణము పాలైరి. పెక్కురు క్షతగాత్రులైరి. ఆయు వున్న కొలదిమంది మాత్రము బ్రదికిరి.

ఇక నా ప్రచండవాయు సంహతులకు ఎన్ని యితర ప్రాణులు మడిసెనో లెక్కలేదు. పశువులు, పక్షులు అనేకములు చచ్చిపడియుండెను.

ఆ బీభత్స ప్రళయాంతమున బాలబాలికా పాఠశాల యెదుట మువ్వురు మిత్రులు కూడిరి. కడచిన రాత్రి గాలి వానకు చెట్ల యాకులు, పువ్వులు, కాయలు రాలి కొమ్మలు విరిగి పడి యింటిపై కప్పు లేచిపోవుటచే పాఠశాల మూయబడెను. వచ్చిన ఉపాధ్యాయులు, విద్యార్థులు అందరు గృహోన్ముఖులైరిగాని యీ బాలురు మువ్వురు మాత్రమేదో మాటలాడుకొనుచుండిరి. వారిలోనివాడా పదేండ్లవాడా ముగ్ధుడా విస్ఫారిత విలోచనుడు.

ఆ మువ్వురు నగరము నన్ని వీథుల తిరిగిరి. క్షుభిత చిత్తులైరి ఆక్రోశించిరి. కనుపించిన ప్రతి దీనదృశ్యమునకు జాలివడిరి. ఏడ్చిరి. ఎవరి గృహమునకు వారు మరలిరి.

ఆ బాలుడు చింతాపరవశుడై ఒక్కడు నింటిలో మూల చాప వేసికొని పండుకొని యున్నాడు. ముఖమున తీర్పరానిదేదో తీవ్రత, దిగులు. ఆతని ఆంతర్యము తలిదండ్రులకే గోచరముగాని నాడిక నెవరికి దెలియదగును? ఎవరి కంత శ్రద్ధ? కాని కలదు. ఆ యింట నున్న పంద్రెండేండ్ల బాలికకు మాత్రము కలదు. గులాబిరంగు చీర కట్టినది. కెందామరలవంటి యరచేతులనేదో కావ్యమును బట్టుకొని వచ్చినదా బాలుని యున్నయెడకు. బాలుడు చలితుడు, చకితుడు. తెల్లని చిరుముత్తియములవంటి ఆమె పలువరుసలు. ఆ పవడంపు మోవి. చలువల నీను నామె కనుదోయి.

'ఏలనా వెరగుపాటు? నేనిట రాగూడదా?' అన్న దా బాల.

'ఏమో? తెలియదు' అనెనా బాలుడు.

చేతిగాజులు గల గల లాడె.

చేతనున్న పుస్తకము బాలున కిచ్చుచు, 'రేపే నేను ప్రయాణము; నీవుకూడ రావలెసుమా; తప్పదు' అనె నామె.

'వత్తునా?' అనెనతడు.

బాలిక నత్తగారు పిలిచెను. బాలుడు శూన్య నిద్రాముద్రితుడు.

# 4

రాజగోపాలుని పెండ్లి అయిన వారం రోజులికి అతడు పరీక్షలో కృతార్థుడైనట్లు తెలిసినది. వెంటనే అతని తండ్రి వియ్యాలవారింటికి సంగతి తెలియజేస్తూ జాబు వ్రాసినాడు. వేసంగి ముగిసిన పిమ్మట రాజగోపాలుడు కళాశాలలో చేరి నాడు. విద్యార్థి వసతిగృహమున భోజనం చేస్తూ మిత్రు లతో తిరుగుతూ రోజులు సుఖముగా గడపుతున్నాడు. తలి దండ్రులు దగ్గర లేరు. పంజరమున నుండియుండి యొక్క సారిగా బైటపడ్డ పక్షివలె నతడు మనసార కరువుదీర స్వేచ్ఛ ననుభవించుచుండెను.

ఇట్లు నాలుగు నెలలు గడచెను. సీత రజస్వల అయినదని శుభవార్త వచ్చినది. జయమనుకొనిరి. మరల నాలుగు నెలలు గడచినవి. సీత తీవ్రజ్వర పీడితయని

దుర్వార్త వచ్చినది. వెంటనే తండ్రి కొమరునికి తంతి యిచ్చి తానూ భార్యా బయలుదేరి వియ్యాలవారింటికి వెళ్ళిరి. రాజగోపాలుడు పరీక్ష హాలులో నుండి బయటకు వచ్చెను. తంతి కబురు చెవినిబడెను. భయకంపితుడయ్యెను. వెనుక తనను బిలుచుచున్న స్నేహితులకు సమాధాన మీయకయే నడచివచ్చెను. ఇంకను తాను హాజరు కావలసిన పరీక్ష యొకటున్నది. కాని యతడు మనస్సును నిలువబట్టలేక పోయెను. తంతి చేయవలసినంతటి తీవ్రజ్వరము కాబోలు నని యతడనుకొనెను. నాటి సాయంత్రపు బండికే అత్తవారింటికి బయలుదేరెను.

అంతకు మునుపే రాజగోపాలుని తలిదండ్రులు ఆ యూరు చేరుకొన్నారు. సీతకు జ్వరోష్ణమధికమై మళ్ళ కొలంది తెప్పించిన మంచుగడ్డ కరిగిపోతోంది. వారు వెళ్ళేటప్పటికి మంచముపై పండుకొనియుంది సీత. ప్రక్క నామె చెల్లెలు పద్మ కూర్చునియుంది. కంటనీరు గార్చెడి చెల్లెలిని జూచి సీత, "పద్మా! అధైర్యపడకు. ఏమో, ఆయువుంటే బ్రతుకకూడదు నేను ?"

"అక్కా! పెళ్ళయి పట్టుమని పది నెలలు తిరుగలేదు. అప్పుడే ఎంత అపకారి అయాడు భగవంతుడు ?"

"చెల్లాయి! నే నొక్కటేమాట చెప్పదలచుకున్నాను, నువ్వాడలకుండా ఉంటే. అయ్యో, ఏమిటే ఆ కన్నీటి జాలువలు ?"

"ఇక ఏడవనులే, చెప్పు"

" నేనిట్లనాథాశ్రితనై వాడి మాడి పోతున్నానని నా కంత విచారంలేదు గాని నన్ను కాంక్షించి నా కొరకు వేచి యున్న మీా బావ దుర్భరవ్యధపాలై జీవితం పాడుచేసుకుంటా రేమోనని నా భయము. వారి హృదయము నే నెరుగుదునుగా. జ్ఞానములేనిదాననుగానుగా..."

" ఇంతవరకు వచ్చినాడుగాడు చూడు బావ ?"

" దాని కేంలే. అందుకు కాదుగాని— క్రిందటి వేసంగి సెలవలకు వారిక్కడికి వచ్చినప్పుడు— నీకే జ్ఞాపక ముండ వచ్చును— ఈ గదిలోనే ఆ ప్రక్క పడకకుర్చీలో కూర్చొని యున్నారాయన. నేను తమలపాకులకు సున్నము రాచి, వక్కలు, ఆకులు నీ చేతికిచ్చి పంపి తలుపునకు వెలుపల ప్రక్క నిలబడి యున్నాను. అవి అందుకుంటూ, 'పద్మా ! వీనికి సున్నము రాచిన దేమో యెవరోగాని, నీచేత నతి మృదుల ములైయున్న యీా తములపాకులు నాచేత నెట్లు ముదిరెడినో చూడు" అన్న వారి మాటలువిని నేను, " ఆర్య పుత్రుని ప్రేమకు నీవే అర్హురాలవుపద్మా!" అని లోపల అనుకొన్న మాటలోని నిజము నన్నెటు తరుముకువచ్చెనా యని నా కాశ్చర్యమగుచున్నది. ఒక వేళ నేనే కనుక ఇప్పుడు ప్రాణములు వదలుట తటస్థించినచో నీవు తప్పక వారినే పెండ్లాడవలెనని నా హృదయంపు కోరికసుమా? మీాకు కలిగెడు మొదటి ఆడు శిశువునకు నాపేరు పెట్టినచో— మీా రిరువురి

యంతరమున—నీకు సోదరినిగా వారికి తొలి ప్రేయసినిగా నాకు స్థానముండగలదని యాసింతును. మీ యిరువురి కన్నీటి బిందువులు నా శిశువు మూర్ధముపై గలిసి కారుచో నే జల మరించినట్లే. ఇంతకు మించి నాకీ జగమున నేమి కావల యును? నా ప్రేమ వెల్లువలై నదీనదముల స్రవించెను. దాని జాడలే లేవు నేడు. నే తలదాల్చిన పూవుల వాసనలో గాలి తరగల నెట కెటకో కొట్టుకుపోయె. నా పడ్డ కష్టములా, శిలలై కొండచరియల నాశ్రయించి యెన్నటికి మాయని చిహ్నములై పడియున్నవి. నా హృదయ మెవరికి తెలియ వలె? ఎవరు తెలియ నభిలషింతురు? నేటికి నా ప్రాణములు గూడ భూతముల గలియనున్నవి. ”

“ అక్కా! ”

“ ఏడువకు తల్లీ!......దాహ మౌతోంది....కాసిని మంచినీళ్ళు! ”

నీరు తీసుకురావటానికి పద్మ వంటింటిలోనికి వెళ్ళినది. మంచము దగ్గరకువచ్చి నిలబడిన అత్తమామలను చూపించి తల్లి యెంత అడిగినా ఫలానా అని గుర్తే పట్టలేక పోయినది. అంత కంతకు మాట పడిపోతోంది. కనులుగూడా మూత పడుతున్నాయి. అత్త మామలుమటు కేం చేయగలరు? కన్నీరు గార్చినారు. ‘సిద్ధాన్నము నేలపాలగుచున్నదే. మా అబ్బాయి యెంత దురదృష్టవంతుడోగదా!’ అనుకున్నారు.

వంటింటిలో పద్మ చెంబు బిందెలోముంచిన చప్పుడూ అంతా గొల్లుమన్న చప్పుడూ ఒక్కసారిగా అయినాయి.

# 5

వసంతప్రభ దెసల వెదజల్లు దినములవి. కోకిలల కూహూస్వనములకు ప్రాణికోటి మైమరచినది. చెట్లను చిగురుపట్టి పిందె కాసి యంతయు నూత్నసృష్టివలె నున్నది. నిర్జీవమై, నిస్సౌందర్యమైన ప్రోడు ప్రూకుగూడ పచ్చ పచ్చని రంగులతో వన్నెలూరుచు పతితుడైన యే నిరాశాక్రోశికిని మరల జీవితమునం దాశ గొల్పుచున్నది.

ఆ పక్షుల కిల కిలతో ఆ కోయిలల కుహూస్వనములతో కలిపి మధురస్వరమున నెవరో వన పరిచిత వనమున పాడుచున్నారు. ఆ త్రోవనే పోవు పాంథయువకుని నిలుప జాలునంతటి సమ్మోహనశక్తి కలదా కోమలి కంఠనాదమున.

క్రిందకు పైకి ఊగిసలాడు చింతచెట్టు కొమ్మ, దానికి కట్టబడి ముందుకు వెనుకకు నడయాడు ఊయెలత్రాళ్లుమాత్రమే మొదటి పరికింపునకు కనబడుతవి. ఇంకను నిలిచి చూచితిమేని అప్పు డప్పుడు తళుక్కుమనులె గాలికెగిరెడు చేలాంచలము, వేణిభరముగూడ కాననగును.

ఆ పాడెడు గోపిక యెవరో !

కృష్ణా ! రావో
భవత్తాళ కీర్తనముల

గొని రావో ప్రేమవార్త
కృష్ణా! రావో॥

ఇదె వదలక యలమికొనెడు
తిమిరమ్ములగుమి యెడంద
భయము భయమ్మని యరచెద
దయనిటు తరలించి త్వదాత్మను, కృష్ణా! రావో॥

వనమున నూగుద మూయెలలు
ఘనసమ్మోదఝరాంబులయలలు
పోవుదమోయీ, భువనము దాటి
నీలవిశాల పథమ్ములదాటి, కృష్ణా! రావో॥

కలవిట మల్లెలు మొగలులు
కలవు గులాబీ పూవులు
విలసితత్వద్దరహాస సుమ
మ్ములె నాకు కొరంతలు, కృష్ణా! రావో

సిగలో వాడెను పూవు
మొగమున దేలెను కనులు
ననుదాక శిరీషసుమమ్ముల
కెనయౌ నీదుకరమ్ముల, కృష్ణా! రావో॥

నేడే తీసితి వీణ
పాడుదు నీవిటరావో
జ్వరతాపభరమ్మున కాగెడు
కరువును నను కరిగింపగ, కృష్ణా ! రావో॥

తోచెడి నాకసమంధతమస్మై
వీచెడి వాయువు లగ్నిమయమ్మై
జడమయ్యె శరీరమిదేమో
పడుచుదనమ్మిక పాపము పాలో, కృష్ణా! రావో॥

భవత్తరళ వీక్షణముల
గొనిరావో ప్రేమవార్త, కృష్ణా ! రావో॥



# కధావ

## క్రొత్త దంపతులు

గోపాలంగారికి లేక లేక ఒక కూతురు కలిగింది. ఆమెను శేషశయన అని పేరు పెట్టారు. ఏ ఉద్దేశంతో ఆ పేరు పెట్టారో అవగతం కాదు. కాని శేషునికున్న గుణాలన్నీ ఆమెలోను ఉన్నాయి. ఘాతుకత ఒకటే అయితే ఎలాగో భరించవచ్చు. కాని విశ్వాసఘాతుకతను భరించటం కష్టం. ఆమెకు ఎనిమిదేండ్ల వయస్సు రాగానే మేనమామ కిచ్చి వివాహం చేసారు. ఆమెకీ వయస్సులో వివాహం జరిగినదంటే యెవరికీ వింత గొలుపదు. కారణమేమనగా అవి శారదా బిల్లు రోజులు. ఎంతెంత జంధ్యాలు తీసివేసిన వారుగూడా పిల్లల పెండ్లి విషయంలో చాల జాగ్రత్త తీసుకున్నారు.

గోపాలంగారికి ఆదియందు చాలా ఆస్తి యుండేది. దాదాపు పది యెకరాలు మాగాని, ఊరికి మధ్య విశాలమైన ఆవరణ్లో పెంకుటిల్లు వారి హక్కు భుక్తాల్లో ఉండేవి. గోపాలంగారి హయాంలో యీ ఆస్తి చాలా మటుకు అమ్ముడయిపోయింది. ఇక నాలు గెకరాలు కుంట్ర మిగిలింది.

దానిని గూడా అమ్మితే వచ్చే మొత్తం బాకీలు తీర్చటానికి సరిపోయేటట్టుంది. అందుచే నిక భుక్తికిగూడా సరియగు మార్గం లేకపోతుందని ఆయన ఒక యుక్తిపన్నాడు. ఈ కాస్త పొలం తన భార్యపేర బెడితే తాను వ్రాసిన బాకీ పత్రాలు ఈ ఆస్తి నేం చెయ్యజాలవుగదా యని ఆయనకు తోచింది. వెంటనే ఆయన తన పెండ్లామును బిల్చి, "అమ్మా! నీ పేర యీ పొలం పెడుతున్నాను. దీనిని నీవు అమ్మటానికి లేదు. కేవలం అప్పులబాధ తీరటానికి ఇలా చేస్తున్నాను. నీ యందు నాకు నమ్మికచేతనే యిలా చేస్తున్నాను. అయితే ఇప్పుడు మనకొక ఆడపిల్ల గలదు. దీని పెండ్లి యెలాగా జరపటం అని ఆలోచిస్తున్నాను." భార్య భర్తమాటల కడ్డంవచ్చి యిలా అంది. "అమ్మాయి పెండ్లికై మీరు రెక్కువ దిగులు చెందవలదు. ఏలననగా దానిని నా పినతండ్రి కుమారుని కిచ్చి చేస్తానంటే అన్ని ఖర్చులూ మా నాన్నయే భరిస్తాడు. మీరు మళ్ళీ రుణం చెయ్యవలసిన అవసరం ఉండదు. కనుక అలాచేద్దాం." సరే నంటే సరే ననుకున్నారు.

గోపాలంగారి మామగారు పెద్ద కుటుంబంలోని వారు. ఆయనకు నలుగురు తమ్ములు ఒక ఆడబడుచు గలరు. ఆయన తండ్రి పోయినప్పటినుండీ యింటి వ్యవహారాలన్నీ తానే చూస్తున్నాడు. దాదాపు నలభై యెకరాల మాగాని ఆయన చేతిమీదుగా ఇతరులకు క్రయమైపోయింది. అయితే తమ్ములను పెద్దవాళ్లనుచేసి, చదువులు చెప్పించి, పెళ్ళిళ్ళుచేసి సమగ్రమైన అనుభవం సంపాదించాడు. ఇప్పుడు వారంతా

ఎవరి జాగ్రత్తమీద వారున్నారు. తానుకూడా రెండెకరాలు కొని భార్యపేర పెట్టాడు. ఆ పొలమే యిప్పుడు తన కుటుంబభారం నిర్వహించడానికి సాధన అయింది. ఇలా ఉండగా తన యేకైక పుత్రికకు వివాహం చేయడం, ఆ పుత్రికకు ఒక పుత్రిక కలగడం నేత్రోత్సవంగా ఉంది. కాని యెటు తిరిగీ యీ రెండెకరాలేగాని యితరమైన ఆస్తి లేకపోవటం ఆయనకు కష్టంగావుంది. అల్లుడు గోపాలం ఆస్తినంతా పాడు చేసి తానూ భార్యా తన యింటిమీద పడ్డారనే తాపం ఒక వైపునా, అతనికి పుట్టిన కూతురును తన వైపు వాళ్ళకు ముడిపెట్టి యీ సంబంధం నిలుపవలెనను కోరిక మరొక వైపునా ఆయనను నిలవరించినాయి.

కూతుర్ని పిలిచి మందలించాడు "నీ భర్తను నీవు అదుపులో పెట్టుకోలేవా? నాలుగు డబ్బులు సంపాదించుకుందాం, పొలం నిలబెట్టుకుందాం అనే ఆలోచన అతనికి మాత్రం ఎందుకు లేకపోవాలి? ఇప్పుడు కూతురు పెండ్లి చేయాలి గదా! ఎక్కణ్ణించి తెస్తాడు?" అని అడిగాడు. కూతురన్నది. "నాన్నా! నీకెందుకీ చింత? నా బిడ్డకు పెండ్లి కాకపోతుందనే విచారం నీకు కలిగితే అందుకు నేను సమాధానం సిద్ధపరిచే వుంచాను. నా భర్త మేనల్లుడు—" అని యింకా యేదో అనబోతోంది. తండ్రి యిలా అన్నాడు: "అయ్యో! వెర్రితల్లీ! నీ బిడ్డకు భర్త పుట్టేయున్నాడు. నీ పినతండ్రి కొడుకు సుబ్రహ్మణ్యం మాట మరచావా?

ఇప్పుడు మెట్రిక్యులేషన్ చదువుతున్నాడు. వాడికిచ్చి చేయండి.''

''అల్లాగయితే పెండ్లి ఖర్చు మీ అల్లుడు భరించరు. కట్నం కానుకలు నీవే చదివించాలిసుంటుంది.''

''అలాగే కానియి తల్లీ.''

ఈ విధంగా వివాహం స్థిరపడింది. అటుపిమ్మట నల్లాళ్ళకు శేషశయనకు, సుబ్రహ్మణ్యానికి పెండ్లి జరిగింది. వచ్చిన చుట్టాలూ, స్నేహితులూ వధూవరులను దీవించి తమ తమ గ్రామాలకు తరలివెళ్ళారు.

## 2

పెండ్లయిన నాటినుండి గోపాలంగారు భార్యమీద, మామగారిమీద కసురుకోవటం ప్రారంభించాడు. తన కిష్టమైన సంబంధం గాక యింకొక సంబంధం తెచ్చుకొని కంఠాని కురిపోసుకున్నానని ఆయన అనేవాడు. తన కిష్టమైన సంబంధం తెస్తే నగలక్రింద వేయిరూపాయిలు వసూలు చేసి యుండేవాణ్ణని ఆయన యుద్దేశ్యం. ఈ బెదిరింపు మాటలతో మామగారి వద్దనుండి మరికొంత పైకం ఊడబెరికాడు. చివరి కా వృద్ధు డల్లుని యాద్ధత్యము తాళుకోలేక, వేరొక చెంప కూతుర్ని పెట్టే బాధలు భరించలేక అసువులను బాసినాడు.

తన మాతామహుడు గతించిన నాటినుండి శేషశయన కష్టాలు ప్రారంభమైనాయి. తన తండ్రికి తానొక్క తెయే కూతురుకాదు. తన కొక తమ్ముడు పుట్టాడు. వాడే యీ ఆస్తికంతా వారసుడు కాబోతున్నాడు. అందుచేత తండ్రికి తనపైనున్న యాదరముకంటె తమ్మునిపైనున్న మమకారం యెక్కువని ఆమె తలపోసేది. సుబ్రహ్మణ్యాని కీ గొడవ యేమీ తెలియదు. అత్తవారింటికి వెళ్లి మూడు నాల్గు దిన ములు గడపి తిరిగి వెళ్లిపోయేవాడు. ఈ స్వల్ప కాలంలో అతనికి భార్యతోడి సంభాషణ జరిగిందంటే అది శయనమంది రంలోనేగాని వెలుపలగాదు. ఆ శయనమందిరం చక్కగా నలంకృతమై, ఇట నట పుస్తకములు గలిగియుండి, యొక నిలువుటద్దముతో, కొన్ని పరిమళ ద్రవ్యములతో నొప్పారు తుండేది. అందు ప్రవేశించి సుబ్రహ్మణ్యం తన భార్యకై యెదురు చూచేవాడు. ఇంట్లో భోజనాదికము లైన తరువాత శేషశయన గదిలోనికివచ్చి తలుపు వేసేది. వెంటనే భార్యా భర్తలు సౌమనస్యంతో సంభాషించేవారు. భార్య కొంచెం పెళుసుతనంగావున్నా లేక భర్త కొంచెం వెటకారంగా మాట్లాడినా రెండవవారు సర్దుకుపోవాలన్న ఆశయం సుబ్ర హ్మణ్యానికి గలదు. కళాపూర్ణోదయములోని పద్యాలతడు కంఠస్థం చేయడమేగాదు వానిని సందర్భాను కూలముగా అమలుపరచడంకూడా తెలుసు. అందుచే భార్యను దగ్గరకు బిలిచి కొన్ని మంచిమాటలాడి అనునయ పరచేవాడు. కాని శేషశయనలో మర్నాటికిగూడా యేమీ మార్పుగుపడేదిగాదు.

భర్తతో చనువుగా నుండటంకాని, అతని కనుసైగలో వర్తించటంగాని ఆమెకు తెలియలేదు. మూకీభావముతో నున్న భార్య నక్కడనే దిగనాడి సుబ్రహ్మణ్యం స్వస్థలానికి వెళ్ళిపోయేవాడు. ఇలా కొన్ని సంవత్సరాలు గడచినై.

శేషశయన సాధారణంగా జానపద బాలికలు చదువు ఉన్నత ప్రాథమిక పాఠశాలల విద్యను పూర్తిచేసి అంతటితో వారి గృహకార్యములు తీర్చుటలో తల్లికి తోడ్పడుతూ ఉండేది. అనువత్సరము వారి యింట నయిదారాబ్దికములు వచ్చును. ఆ సమయములలో నింటికడ పనులు చేయుట కేమి, భోక్తలకు వడ్డించుట కేమి, ఈ మున్నగు గల సకల కార్యములు నిర్వహించుటకును తల్లికి తోడ్పడుటయే గాక ఆమెకు తీర్చిదిద్దగల విజ్ఞానము గూడ శేషశయన సంపాదించినది. వారు నివసించు నదొక చిన్నపల్లె. అటనున్న బ్రాహ్మణ గృహములు పదునైదుకు పైబడియుండవు. కాని వారిలో కక్షలేనినిమిదివరకు నుండును. మడిబట్టలవారు, పట్టుబట్టలవారు నని సామాన్యమైన రెండు తెగలవారుగాక, మాధ్యాహ్నపు భోజనమువారు, రాత్రి భోజనమువారు నని మరి రెండు తెగలేర్పడ్డారు. ఒకరి పంక్తి నొకరు కూర్చొనకుండ తప్పించుకొనుటకే కాలవిరామమేర్పడినది. ఇన్ని కక్షలతో నుండి వారు బ్రాహ్మణుల మనిపించుకొనుచున్నారంటే అది యితర కులస్థుల మంచితనముమీద నాధారపడియున్నదని చెప్పవచ్చును.

కాని గోపాలంగారిపై అంతు తెచ్చే పెద్ద మనుష్యు డొక్కడూ ఆ యూర లేకపోయెను. శేషశయన యిప్పుడు పాతికేండ్ల వయస్సు కలిగియున్నది. భర్త సుబ్రహ్మణ్యాం తెలివి తక్కువవాడు కాడు. బాగా చదువుకున్నవాడు. శాంత స్వభావుడు. అయినను అతనిపై గోపాలంగారి కేలనో ఆగర్భశత్రుత్వ మేర్పడినది. ఆడపిల్ల నిచ్చితిమన్న జంకై నను ఆయనకు లేదు. తన చెప్పు చేతలలో నుండి తాను బెట్టినది తింటూ తన యింట బడియుండవలెనని రాజగోపాలం గారు సుబ్రహ్మణ్యము నాదేశించిరి. సుబ్రహ్మణ్యానికి సుత రామూ అందుల కిష్టము లేదు. గోపాలంగారి స్వభావ మాతనికి క్రొత్తకాదు. తన మామగారి నడ్డము వైచుకొని గట్టిక్కి పిమ్మట నాయనమీదనే కత్తిని దూసిన విశ్వాస ఘాతుకుడని గోపాలంగారిమీద సుబ్రహ్మణ్యానికి తగనిమంట. గోపాలంగారితో నెక్కువ ప్రసంగింపడు. ఆయనైనను అల్లుని యోగక్షేమ మారయుట యరిది. ఒక పర్యాయం సుబ్రహ్మణ్యాం గోపాలంగారితో బంధుభావంగా మాట్లాడ బోయినాడు. దానికాయన వెఱ్ఱికోపము చెంది "నీ సుఖువు బలువులు నువ్వు చూచుకో. నీకు మేము చెప్పేవాళ్ళము గాము. మా సలహా నీకు దేనికి? నీ కంటికి మే మానం" ఈ మొదలైన యెద్దేవాలతో అతనిని నోరు మెదపకుండా చేసాడు. సుబ్రహ్మణ్యాం చిన్నబుచ్చుకు మరలిపోయాడు.

రాను రాను మామగారు తనయెడ కోప మధికము చేసుకోవటం సుబ్రహ్మణ్యాం కనిపెట్టాడుగాని పరిస్థితు లింత

తీవ్రరూపము తాల్చునని యనుకోలేదు. ఇప్పుడు తాను ముప్పది మూరేండ్ల వాడయినాడు. తన జనని వృద్ధురా లయినది. ఆమెకు చేదోడుగా నుండు ఆడపిల్లలు లేరు. అందుచే కోడలిపై నాశపెట్టుకొని యామె రాకకై యామె యెదురు చూచుచున్నది. కాని యెంతకాలమునకు కూతురిని బంపక గోపాలంగారు తిప్పలు పెట్టుచున్నాడు. సుబ్రహ్మ ణ్యానికేమి చేయటానికీ తోచలేదు. ఒకరోజున బయలు దేరి వెళ్ళాడు నిక్కచ్చిగా అడుగుదామని. అతనిని చూచి భార్య పూర్వము వలెగాక క్రొత్త రీతిగా మాట్లాడింది. ఏ భర్తనూ ఏ భార్య అడగని ప్రశ్న నడిగింది. దానితో సుబ్రహ్మణ్యం బాధ మరీ అధికమైంది. అతడు భార్య తన్నిలా శంకిస్తుందని యెన్నడూ అనుకోలేదు. ఇప్పు డీ కలత యేర్పడడానికి కారణమేమా యని యాతడు విస్తుపోయాడు. కోపమును దిగమ్రింగి, "మీ యింటికి తరుచు వస్తూ ఉండ బట్టి మీకింత తేలికయాను. నీ కోసం వచ్చినందుకు నేను పరితపిస్తున్నాను. నాదే బుద్ధి తక్కువ. మీవాళ్ళు మంచి వాళ్ళే" అని అంటుండగానే మామగారు వచ్చాడు. రుస రుస లాడుతూ అల్లుణ్ణిచూచి, 'ఏం ఇన్నాళ్ళనుండి అక్కర లేని భార్య యిప్పుడు కావాలిసొచ్చిందా ?' అని అడిగాడు. ఈ మాట సుబ్రహ్మణ్యానికి శూలంవలె గ్రుచ్చుకుంది. తన భార్యను తాను వదిలియుండటానికి కారణం వాళ్ళు పంపక పోవటమేగాని తాను తీసుకొనిపోవటం కాదుగదా యని అనలేకపోయాడు.

# 3

భార్యా భర్త లిద్దరూ ఈ విధంగా ఎడబంధమై పోయారు. తండ్రి చెప్పినమాట వింటూ శేషశయనా, భార్య నెట్లు రప్పింపవలయునో తెలియక సుబ్రహ్మణ్యము తమవలపు జీవితాన్ని అనుభవింపలేక పోయారు. ఇలా పదేండ్లు గడచి నాయి. ఎప్పుడో తన భర్త వస్తాడు, తనను తీసుక వెడతాడు అనే ఆశ శేషశయనను వీడలేదు. సుబ్రహ్మణ్యానికిగూడా భార్యమీది ప్రేమ సడలలేదు. కాని కాలం వారి సమాగమానికించుకైనా తోడ్పడలేదు.

ఏ నిమిషాని కేమి రానున్నదీ యెవరికీ తెలియదు. ఆనాడు మహాశివరాత్రి. దేశము నలుమూలలనుండి యాత్రికులువచ్చి కృష్ణలో స్నానాలు చేస్తున్నారు. భార్యాభర్తలు కొంగులు ముడివైచుకొని మునుగుతున్నారు. తడి బట్టలు పిండి యారబెట్టుకొనుచున్నారు. తప్పిపోయిన బిడ్డలకోసం వెదికేవారు రోదిస్తూ వెదుకుతున్నారు. సూర్యభగవానునికి తర్పణలు విడుచువారా పనిలో నిమగ్నులై యున్నారు. విజయవాడలో కృష్ణాతీరమంతా కోలాహలంగా నున్నది.

ఆ రోజే శేషశయన, జననీజనకులు, కృష్ణాతోయము లలో మున్కలిడవలెనని వచ్చారు. ముందు తండ్రి, తరువాత కూతురు, పిమ్మట తల్లి నడిచివచ్చారు. కృష్ణ శిశిరజల సంపూర్ణయై యుప్పొంగుచు వచ్చుచున్నది. ఆ నదీ తోయము లలో మీనములు ఎగిరిపడుటచూడ మన్మథావిర్భావఘట్టమున

మీనకేతనునిరాక యనదగి యుండెను. శేషశయన తాను తెచ్చిన పసుపుముద్దతడిపి ముఖమున రాచుకొని నీళ్ళలోనికి దిగినది. తల్లి యామె నొకచేత బట్టుకొని వెనుకనే వచ్చుచుండెను. తండ్రియు వారికి సమీపముననే నడుములోతు నీళ్ళలో స్నానముచేయ నుపక్రమించుచుండెను.

ముగ్గురూ స్నానమాడి తడిబట్టలు విడిచి, పొడిగుడ్డలు కట్టుకొని కనకదుర్గ దర్శనము నిమిత్తము కొండపైకి బయలుదేరినారు. కొబ్బరికాయలు, కర్పూరముకొని చేతబట్టుకొని ముగ్గురూ కొండపైకి దారి తెలిసికొని నడిచిపో దొడగినారు. వారిని గాంచి బిచ్చగాండ్రు నోరు దెరచి యడిగినారు. వారు గుప్పెడు గుప్పెడు బియ్యము చొప్పున నందరికి నిచ్చుచు తృప్తిపరచినారు. వారి వెంట నొక పురోహితుడు వచ్చుచుండెను. ఆతడు వారినించుక హెచ్చరించెను. “అయ్యా, వీరు నిత్యయాచకులు. వీరికిది వృత్తి. మీ చేదస్తముగాని వీరు నిజముగా దరిద్రులుగారు. వీరిలో చాల మంది ధనవంతులుగలరు.” గోపాలంగారు నిజముగా ఆశ్చర్యపడెను. “వీరు తమ కుష్ఠదానితో సుఖముగా జీవింపక యేల యిట్లు బిచ్చమెత్తెదరు?” పురోహితు డిట్లనెను. “శతకోటి దరిద్రులకనంతకోటి ఉపాయాలు. ఈ విధంగా వీరు సాధువులవేషము వేసికొని యీదారిప్రక్కన కూరుచుండిననేగాని మీ వంటి భక్తులు కనికరింపరని యిట్లు చేయుచున్నారు.” గోపాలంగారటనుండి కదలి భార్యాపుత్రికలతో దుర్గగుడి బహిఃప్రాకారమును చేరజనెను. అక్కడ కొందరు జనము గుమిగూడిరి,

వారందరొక సాధువునొద్ద సాముద్రిక పరీక్ష చేయించుకొను చుండిరి. ఆ సాధువు తలపై జటలు కేల నక్షమాలిక ధరించి యున్నాడు. పద్మాసనాసీనుడై కడు శ్రద్ధతో తన కడకు వచ్చినవారి చేతులను బరీక్షించుచుండెను. కొందరాయన మాటలను చెవియొగ్గి వినుచున్నారు. కొంద రాయనకంటి పసితనము నుగ్గడించుచున్నారు. మరికొందరా సాధువుప్రజ్ఞ కబ్బురపడు చున్నారు.

గోపాలంగారు సాధువునుజూచి తటాలున నిలువబడి నాడు. ఆయనకు సాముద్రికము నందలి పిచ్చి చాలగలదు. తన కూతురు జాతకము పరీక్షింపజేయవలెనని యెన్నాళ్ళనుం డియో యెంచుచుండెను. ఇప్పుడీ సాధువేదైన మంచిమాట చెప్పునేమో వినవలయునని యువ్విళ్ళూరెను. తన యూహ భార్య కెరిగించెను. ఆమె కూతురు చెవిలో నదియో యూదెను. అంతట శేషశయన వల్లెయని తన యంగీకృతి నెరుకపరచెను.

పిమ్మట గోపాలంగారు జనము నొత్తిగిలజేసి సాధువు నొద్దకు దారిజేసెను. అతని వెంట కూతురు, భార్య వచ్చిరి. గోపాలంగారు సాధువునుజూచి యిట్లనిరి: "గురుదేవా! మా బిడ్డ జాతకమును మీరు పరీక్షింపవలయును." 'రామ్!' అని యా సాధువు తన చూపుడువ్రేలును పైకి ఎత్తెను. దైవకృప యుండవలెను అని యా సాధువు అభిప్రాయమైనట్లుగా గోపా లంగారు అర్థము చేసికొనిరి. పిమ్మట శేషశయన సాధువు నెదుట చదికిలబడెను. సాధువు దృష్టి ఆమెను కంపింప

జేసెను. ఆమె సాధువును తేరిపార జూడనైన జాలకపోయెను. అంతట గోపాలంగారాదేశింపగా శేషశయన తన హస్తమును ముందుకు చాచెను. ఆమె యరచేతనున్న రేఖలు సాధువొకపరి చూచెను. అటు తరువాత నామె చేతిని తన యెడమ చేత బట్టుకొని కుడిచేతితో బోధ పరచుచు ఫలితముల జెప్ప దొడగెను. శేషశయన యొడలు ఝల్లుమనెను. సాధువు గోపాలంగారితో నిట్లనెను. "ఈ బిడ్డ మీరు కన్నదాది చాల కష్టములనుభవించినది. నేటి కా కష్టములు గట్టెక్కు సమయ మాసన్నమయినది. మీరీమె నిటకు గొనివచ్చుటలో మీ యుద్దేశ్య మెరుగుదును. అంతా సరియగును" అని చెప్పి యా సాధువు శేషశయనకొక తాయెతు నిచ్చి "దీనిని నీ మంగళ సూత్రమున ధరింపుము" అని చెప్పెను. అంతట గోపాలంగారు "మా పిల్లకు పెండ్లి యైనదని మీ రెరుగుదురా?" అని ప్రశ్నించెను. "ఎరుగకేమి? ఆ రామచంద్రుని కృపవలన మా కంతయు దెలియును. ఈమె భర్త యెవరోగూడ మే మెరుగుదుము. ఆయన యిప్పుడీ నగరముననే యున్నాడు. మీరు కోరినచో రేపీ వేళకు ఇక్కడకు రప్పించెదను. మీరదే సమయమున కిక్కడకు వచ్చెదరేని మీ యల్లుని గాంచగలుగుదురు" అని చెప్పి సాధువు మరల గనులు మూసికొని తపోనిమగ్నుడయ్యెను. గోపాలముగారు సాధువు చెంత రెండరటి పండ్లుంచి భార్యా పుత్రికలతో దరలిపోయెను.

## 4

మర్నాడు యథాప్రకారం శేషశయన, ఆమె తలి దండ్రులు దుర్గగుడి దగ్గరకు వచ్చి సాధువుకోసము వెదికిరి. ఆత డెచ్చటను నగుపడలేదు. అంతట వారా గుడి పూజారి నడిగిరి. అతడు వారితో నిట్లనెను. "అయ్యో, నేటి తెల్లవారుజామున ఆ సాధువు తనతో నొక యువకుని దీసి కొని వెళ్ళినాడు. తనకోస మెవరైన వచ్చినయెడల నించుక సేపాగుడని చెప్పుమన్నాడు. తమరా సాధువుతో బని యుండి వచ్చినచో పదిగంటలగువరకు నిచ్చట వేచియుండిన నతడు రాగలడు."

పూజారి మాటలు గోపాలంగారికి వింత గొలిపినవి. సాధువుతో నొక యువకుడుగూడ నున్నాడని యాత డెరిగిం చిన. వెంటనే యా యువకు డెవరై యుండునా యని యాయన ఆలోచింప దొడగెను. గోపాలంగారి భార్య తన తనయ దుస్థితిని దలంచి వాపోవుచుండెను. శేషశయన కడు దూరము నడచి వచ్చుటచే మిగుల డస్సినదై తల్లికి దాపుననే మేను వాల్చెను. గోపాలంగారు వేరొకచో గూరుచుండి పత్రిక నవలోకించు చుండెను.

గోపాలంగారు అల్లుని యెడ నించుకయు సమేళన భావము పూనరు. అల్లుని మనోవ్యాపారము గ్రహించుట కించుకయు నాయన ప్రయత్నింపడు. అల్లుని నడత సరిగా

లేదని యభిప్రాయపడును. ఆయనకు లోకములో సరియైన వా రెవరనగా నొక్క యుపాధ్యాయ వృత్తిలో నున్నవారు మాత్రమే. తక్కినవారి యెడ నాయనకు ద్వేషబుద్ధి సహజముగానే యేర్పడినది. పచ్చకామెర్లు కలవానికి లోకమంతయు పచ్చగా కనబడినట్లు, ఆయన భిన్నవ్యాపార పరాయణులైన లోకులు తనవలె సజీవులైనవారు కారని తలచుటలో ఆశ్చర్యము లేదు. కాని తన యల్లుడు తన చెప్పిన చొప్పున నడుచుకొని ఆత్మస్వాతంత్ర్యము నమ్ముకొనువాడు గాడు. ఈ యుభయుల వ్యత్యస్తాలోచనల నడుమ శేషశయన ముందుకు నూయి వెనుకకు గోయి అన్న సామెతలో బడినది.

వారు కూర్చుని కూర్చుని యెంతకును సాధువు క్రిమ్మరి రాకుండుటకు మిగుల విసుగుచెందిరి. ఉదయభానుడు చండ కిరణముల వేడిమి నినుమడింపజేసికొనుచు నడి నెత్తిపైకి రాదొడగెను. దేవాలయమునకు వచ్చిన భక్తులు క్రిమ్మరి పోదొడగిరి. పూజారి గుడి తలుపులను మూసి చను యత్నములో నుండెను. ఆ సమయమున కృష్ణనుండి వచ్చు జన సమూహ మొకటి వారి కంటబడెను. ఆ జనము నడుమ జ్ఞానతేజముతో వెలుగొందు సాధుపుంగవుడుగూడ నుండెను. ఆతని కించుక వామభాగమున గోపాలంగారి యల్లుడు సుప్రసన్న వదనముతో నడచివచ్చుచుండెను. సుబ్రహ్మణ్యమును గాంచి గోపాలంగారు భార్యతో, "అల్లుడు

గూడ వచ్చుచున్నాడు" అనిరి. శేషశయన కీ మాటలు దారుణాంధకారమున మిణుగురువలె దోచినవి. వెంటనే యామె లేచి జననీ జనకుల వెనుక తట్టున కేగినది.

సాధువు, సుబ్రహ్మణ్యము తమతో వచ్చిన జనమును క్రమ్మరిపోవలసినదిగా నాజ్ఞాపించిరి. అటుపిమ్మట సాధువు యథాస్థానమున నాసీనుడై సుబ్రహ్మణ్యమిచ్చిన ఫలహార మును గైకొని గ్రంథావలోకనము చేయుచుండెను. ఆ వేళకు గోపాలంగారతనిని భార్యా సహితముగ సమీపించి, "అయ్యా, మా గోడు మీరు వినవలతును. ఈ కుర్రవాడు మా అమ్మాయిని చేపట్టి, ఇప్పుడు మా మాట వినక చెడిపోతున్నాడు. మీ రతనిని సరియైన మార్గమున బెట్టవలెను."

అంతట సాధువు గోపాలంగారి మాట కడ్డమువచ్చి, "ఈ యువకునితో మీరు ప్రసంగింప వలసిన పనిలేదు. ఇతనిని నా కుమారునిగా మీరు భావింపుడు. మీ కూతురు మీ కెంత తీపియో, ఇతడును నా కంత తీపి. ఈయుభయుల క్షేమము, ఉభయుల సహజీవనము మనము సమన్వయపరచవలెను. ముందీ బాలిక తన మనోభిప్రాయమును వ్యక్తము చేయవలెను" అని శేషశయనను ముందుకురా నియమించెను. సాధువు వెనుక నిలబడిన సుబ్రహ్మణ్యం నవ్వునాపుకొనలేక, "నన్నుమీ రిప్పటికైన గుర్తించినందుకు నాకు సంతోషముగా నున్నది. నిన్న మీరు కృష్ణవరకు ఎక్కి

వచ్చిన బండితోలిన దెవరు? నేటి యుదయము మీరు గుడికి వచ్చినపుడు మీకు దుర్గదర్శనము లభింపజేసిన పూజారి యెవరు? అటు పిమ్మట మీరు పత్రికకై తపించు సమయమున మీకు పత్రిక కొనితెచ్చి యిచ్చిన వ్యక్తి యెవరు? ఈ ప్రశ్న లకు మీరు సమాధానము చెప్పండి. తరువాత నన్ను దూషింతురుగాని. నేను దేశద్రిమ్మరినై చెడిపోవుచున్నానని మీరనగానే సరిగాదు. మీరు ఉపాధ్యాయులు. అయినను మీ కితరులతో ప్రమేయములేకుండా ఒక్క గడియ గడవదు. అట్టితరి మీ రితర వృత్తిమాతులనేల యేవగించుకొనవలెను? మీవలె వారికి తెల్లని యుడుపులు, మాయని కంటియద్దము, కాన్వాసుబూటు లేవనియా? లేక మీవలె వారికి సంసార తాపత్రయము లేదనియా?

“నిన్న మీరు నన్నుచూపుమని యీ సాధువును వేడి నారట! నేను మీ మాటలు వింటూ యిక్కడ చేరిన జన సమూహాలోనే యున్నాను. మీరది గుర్తింపజాలరైరి. లోక ములో దేశకాల పాత్రముల నెరిగి వ్యవహరింపవలెను. అసలీ జగమే యొక నాటకము. అందు ఏ యొక పాత్ర కొరవడి నను లోకము ముందునకు పోదు.”

ఈ మాటలకు గోపాలంగారు లజ్జచెంది సాధువు పాద ములపై బడిరి. సాధు వాయనను లేవనెత్తి, “వత్సా! గతించినదానికి చింతింపకుము. నేటితో మీ కష్టములు గట్టెక్కినవి. ఈ బాలుడు మీరు తలపోసినట్లుగా నవివేకి

కాదు. మీ మనశ్చాంచల్యమే మిమ్మింతవరకు దెచ్చినది. ఇప్పుడీయనపొత్తు విడువకుడు. మీ అమ్మాయియు ఈయన వలన సుఖించును" అని ఆశీర్వదించెను.

గోపాలంగారు అల్లుని దీసికొని శేషశయన, భార్య అనుగమింపగా నగరములోనికి జనెను. నాడు మొదలుకొని శేషశయన సుబ్రహ్మణ్యంతో చనువుగా మెలగుతూ అతడు తన భర్త అనే సూనృతమును అవగతం చేసికొని నిశ్చింతగా జీవింపదొడగినది.



# కథావళి

## హి

## 1

" కల్లు మానండోయి జనులార మీరు
కళ్లు తెరవండోయి
ఇల్లు వళ్ళు గుల్లచేసే కల్లుమాని భరతఖండపు
ఖ్యాతి నిలపండోయి ! "

అని పాడుతూవుంది సంజీవి టేబులువద్ద కూర్చుని లేసు అల్లుకుంటూ, శర్మ సెంట్రలునుండి రిక్షా చేసుకుని తమ యింటికి వచ్చేసరికి. అతని కది ప్రథమ పర్యాయం రావటం కాదు మద్రాసుకి. అంతకు ముందు ఒకటి రెండు సార్లు వచ్చాడుగాని ఎప్పుడూ పట్టుమని పదిహేను రోజులైనా అతడు పట్నంలో ఉండలేదు. వచ్చిన నాలుగు రోజులూ వేడుకలు చూడడంతోనే సరిపోయేది. వెంటనే తిరుగుముఖం పట్టేవాడు. ఒంటరిగా నుండుటకయే ఖర్చు సామాన్యం కాదు. డబ్బు జేబులో వేసుకొని బజారికిపోతే ప్రతిది అవసరమే ననిపిస్తుంది. అతడు తెచ్చుకున్న నలువది యేబది రూప్యములు కొలది కాలములోనే ఖర్చుపడి ఇక నట నిలు

చుట వీలుపడని పరిస్థితి యేర్పడేది. అందుచేత నతడెంతో యనిష్టంతో తిరిగి రైలెక్కి స్వస్థలానికి మరలిపోయేవాడు.

ఈసారి యతడొక యుద్యోగములో చేరి నాలుగురాళ్ళార్జించవలెనన్న సుసంకల్పముతో వచ్చాడు. అదీ గాక యతనికి మద్రాసొక సుపరిచితమైన నగరముగా నుండుటచేత స్టేషనునుండి వేరెక్కడకును బోక ఎకాఎకి దన్ను నియమించుకున్న యధికారివద్దకు వచ్చి హాజరయ్యాడు. ఆ యధికారి కడులౌకికుడు. జగము ధన ప్రధానమనియు, అది మినహా లోకము మిథ్యయనియు నమ్మేటటువంటివాడు. ఈ తత్వము శర్మ కంతగా సరిపడదు. డబ్బు నార్జించుట పురుష లక్షణములలో నొకటిగా నతడు భావించినను అదియే మన ఇహపరసాధనమని చెప్పిన నతడు నమ్మువాడు కాదు. ఆతని కంతరాత్మ ముఖ్యము. ధనవంతుల యౌద్ధత్య మాతని నొక్కొక్కప్పుడు కోపకంపితుని జేయును. అయినను ఇప్పుడు ఉద్యోగరీత్యా ఈ యున్నతాధికారి నాతడు సేవింపక తప్ప దయ్యెను.

ఆ యధికారి శర్మనుజూచి యిట్లడిగెను.

'మీరు ఉపాధ్యాయ వృత్తికి తరిఫీదయినారా?'

'అయానండి'

'ఉపాధ్యాయ ట్రైనింగులో కృతార్థులయారా?'

'ఒక విషయములో మినహా అన్నిటిలో గెలుపొందాను.'

'అయితే మీకు నేనిచ్చే వేతనము నా యుత్తరువులో నిచ్చినదిగా నుండజాలదు. కారణమేమన మీరు ట్రైనింగులో జయముపొందారని మీ కంత యెక్కువ జీతం యిస్తానన్నాను. కాని మీ రిప్పుడు నిజం నెమ్మదిమీద బయటపెడుతున్నారు.'

భార్య తలుపు వెనుక నిలబడి వింటూఉంది. శర్మ యించుక లజ్జదోప నామెను పరికించెను. చాల విద్యావతివలె నున్నది. భర్తమాట కడ్డమువచ్చినది. 'వసంతుడు చెప్పిన మాట వినటంలేదు. బడిలోకి పొమ్మంటే పోడు. ఇంటివద్ద అల్లరి చేస్తున్నాడు. మనకు ప్రయివేటు టీచరు కావలసియే యున్నది. మీరేల యీ క్రొత్త మాష్టరుగారిని నియమింపగూడదు ?'

"అలాగే. నేనూ ఆ విషయమైయే యిప్పుడు వీరితో ప్రస్తావిస్తూ ఉన్నాను. వీరికి ఉచితవసతి భోజనములతో పాటు నెల కేబది రూపాయలిచ్చు షరతుతో నియమించుచున్నాను" అని భార్యకు తృప్తికరమగు రీతిని శర్మ నుద్యోగము లోనికి దీసుకొనెను. భార్యమాట వేదమువంటి దనుట కింతకంటె ప్రబల తార్కాణమేమి కావలయును ? చాలదూర మేతెంచిన కారణమునను, నిరుద్యోగిగా నుండుట కిష్టము లేకను ఆ తగ్గు జీతమునకే యొడంబడి శర్మ ఆ యధికారి తనయునికి చదువు చెప్ప నారంభించెను.

పిల్లవాడు చురుకైనవాడేగాని యా చురుకుదనము సర్వతోముఖము గాదు. ముఖ్యముగా సిటీ బాలురలో

నుండెడి మాటకారితన మాతనిలో మెండుగా నుండెను. ఒకరో జాతడు జాము ప్రొద్దెక్క నిదురలేచెను. వెంటనే వంట బ్రాహ్మణు డాతని బిలుచుకునిపోయి యొక కప్పు కాఫీ యిచ్చి వేరొక కప్పునిండా శర్మకు పోసి యిచ్చి పంపెను. శర్మ యంతకు ముందే కాఫీ త్రాగి తన విద్యార్థికై యెదురు చూచుచుండెను. తన కుచిత భోజనముతో బాటుచిత అల్పాహారముగూడ లభ్యమగునని యాత డెరుగడు. శ్రీమంతుల యింట తనకెట్టి కొదువరాదని యతని కప్పుడు తెలియనయ్యెను. కాఫీ త్రావి శర్మ చిరుచెమ్మటలు క్రమ్మనిట్లనుకొనెను. "వీరెంత మంచివారు. పరాయివాడనని, క్రింది యుద్యోగినని అలక్ష్యము చేయక నన్నాప్త మిత్రునివలె నాదరించుచున్నారు. వీరికి నేనే విధముగా నా కృతజ్ఞత తెలుపగలను ?" అట్లు తలపోయుచు నాతడు తన విద్యార్థికి గణితము చెప్పపోవు సమయమునకు గేటు గుండా ఒక కారు లోనికి వచ్చుట శ్రవణ గోచరమయ్యెను.

కారు వచ్చి యాగుటతోడనే అందులోనుండి యొక పదునారేడుల జవ్వని, చెంపకు చేరెడు కన్నులతో ముద్దులొలుకు ముంగురులతో శర్మ, ఆతని విద్యార్థి ఆసీనులయి యున్న గదిలోనికి వచ్చి యా యుభయులను వీక్షింపసాగెను. వెంటనే యాతని హృదయమున నొక నూతనావేశము గలిగెను. ఒక్క నిమేషము కాల మటనాగి యా యువతి మరలిపోయెను. "ఆమె యెవరు ?" అని విద్యార్థి శర్మ నడిగెను. అతడును ఇంచుక లజ్జదోప "ఆమె నా సోదరి"

అని బదులుచెప్పెను. శర్మ తన విద్యార్థిని జూచి యిట్లనెను. "మీరు నను బోలిన నిరుపేదని, మనోదుర్బలుని ఉపాధ్యాయునిగా నియమించుకున్నారు. నేనేమి చెప్పగలుగుదునో తెలియకున్నది." శర్మ మనస్సులోని భావము నాతని విద్యార్థి గ్రహించెనో లేదోగాని 'నో ఫియర్ సార్' అని గంభీరముగా బలికెను. శర్మ చేతనున్న పుస్తకముపై నొక యశ్రు బిందువు చిందెను.

ఇక కొంచెము సేపటిలో వారు మధ్యాహ్న భోజనమునకు లేవవలసియుందురు. భోజనమునకు ప్లీడరుగారు, ఆయన అల్లుడు, కూతురు, కొమరులు, మనుమడు, మనుమరాలు అందరు వత్తురు. ఆ పంక్తిలోనే శర్మగూడ కూరుచుండవలయును. ఆతడెన్నడూ పొరుగింటికి భోజనమునకు బోయి యెరుగడు. ఇప్పుడు నలుగురిలో గలిసి తిరుగ నేర్చుటయేగాక భోజనముగూడ నేర్వవలసియుండెను. శర్మకాతని విద్యార్థి యొక పట్టువస్త్రము తెచ్చియిచ్చెను. దానినందుకొని ధరించి యాతడు భోజనమునకు వెడలెను.

భోజనాల వద్ద శర్మ ప్రసక్తి ప్లీడరుగారే తెచ్చిరి. ఆయన చాల పేరు గడించిన హైకోర్టు న్యాయవాది. జడ్జీ పదవిని నిరాకరించి న్యాయవాద వృత్తినే కొనసాగించుచుండెను. ఆయనకు రెండు కారులు కలవు. ఒకటి యల్లునిది, ఒకటి తనది. అల్లుని తనయునికే శర్మ ప్రయివేటు చెప్పుచున్నాడు. ఆతని సోదరినే నాటి యుదయము చూచి

శర్మ ప్రేమోద్విగ్న హృదయు డయ్యెను. ఆ యుద్విగ్నత యామె రూపమును చూచియో లేక విద్యను జూచియో యిట చెప్పజాలము. రూపమును మించిన విద్యయు నామెకు కలదన్న నాశ్చర్యములేదు. ఆమె పేరు ఇందిర. గానకళా విశారద కాదేమోగాని వర్చస్విని. విద్యావతి. ఆమె నోట వెలువడు నొక్కొక్క మాటకు శర్మ యంతరాంతములు కదలు చుండెను. అయినను ఆత డెంతవరకు చనువుగా నుండ దగునో యంతవరకే వారితో జనువుగా నుండెను. తానంతకు బూర్వ మెన్నో గేయములు రచించి ప్రచురించినను, తనపే రాంధ్రలోకమున బత్రికలద్వారా తెలిసినదే యయినను తన్ను గనినవా రెవరు నా ప్రసక్తియే లేకుండుట శర్మకించుక కష్టముగానే యుండెను. తానొక నిగూఢ భావకవిగా నుండ వలసినదేగాని తన కవితా పాటవము జనులముఖతః తానెరుగ దగదా? తన రచనలు చాలవరకు బత్రికలలో వెలువడినవి. అయినను ఆతనికి దృప్తిలేదు. వేదికపై నుపన్యసించిననేగాని తన యాత్మశ్లాఘన ఫలోన్ముఖము గాదని యాతడు భావింప నోపును. లేనిచో నాతని కా యసంతృప్తి యేల? ప్రచార మునకు పత్రిక లెంత యవసరమో వేదికయు నంతే యవసర మని యాతడు గుర్తించెను. కాని యిప్పుడాతని కర్తవ్యము బాలునికి విద్య గరపుట, ప్లీడరుగారి యల్లుడిచ్చు వేతనముతో పొట్టబోసికొనుట. అన్యమగు చింతనకు తావేలేదు.

## 2

వసంతకుమారుడు ప్లీడరుగారి యల్లునికి కలుగక కలుగక కలిగిన కొడుకు. అందుచే నాయన కడు గారాబముగా నీ బాలుని పెంచుచు పదునాల్గేడులు వచ్చువరకు బాలుని విద్యాభ్యాసమున కెట్టి శ్రద్ధయు చూపలేదు. ఇప్పు డొక్క పర్యాయముగా నతనిని స్కూలుఫైనలులో వేసిన బాగుండ దాయని యాయన కనిపించును. కాని యది యసాధ్యమని గుర్తించి యిప్పుడే ప్రయివేటు విద్యవలన కొంత సాధిక చేయించి అధమము నాల్గవ ఫారములోనైన జేర్పింపవలెనని నిశ్చయించెను. ఇందిర వసంతకుమారునికంటె రెండేండ్లు పెద్ద. చాల తెలివిగలపిల్ల. చదువులోనేమి ఆట పాటలలోనేమి తోడి విద్యార్థినులలో నామెకుగల పేరు సామాన్యులకు దుర్లభము. అట్టి యీ బాలిక అవివాహితయై యుండుట మరియు ముదావహము. పదునాల్గేడులకే పెండ్లి చేసుకొని, గర్భవతులై, బిడ్డలనుకని దుర్బలాంగులగు కొందరు సాంప్రదాయ దాసులకంటె నీ యువతి యెన్నిరెట్లు మిన్నయో సంఘశ్రేయస్సునుగోరు బ్రాహ్మ సామాజికాది సంస్కర్త లెరుగుదురు. హిందూ సంఘమున కీ బాల్య వివాహమను కళంకము మన దేశమున పేట్రేగియున్నది. దీనిని వారించుటకు కీ. శే. వీరేశలింగం పంతులు, సర్ ఆర్. వెంకటరత్నం నాయుడు, మున్నగు పెద్దలెన్ని మార్గములు చూపినను వాని నీసడించి సనాతనాచార పరులమని చెప్పుకొను కొందరు తమకు దామే హాని తెచ్చుకొనుచున్నారు

గదా ! జీవితసమస్యమైన వివాహమును సనాతనాచార పరులమని చెప్పికొనువారెంత యపరిమిత వేగముతో బరిష్క రింప జూచుచున్నారు ! బాల్య వివాహముల వలన కష్ట ములు రాజా రామమోహనరాయలు, కే. శే. కేశవచంద్ర సేను, దేవేంద్రనాథ ఠాగూరు మున్నగు వారు తమ యువ న్యాసములలో దెలియజెప్ప వినియు, సాంప్రదాయాంధీభూతు లైన హిందూ గృహస్థులు పది యేండ్లకే తమ బాలికలకు వివాహముచేసి యేమి బావుకొనుచున్నారో !

వసంత కుమారునికి శర్మగారి సాంగత్యము వలన చాల నవీన దృక్పథ మేర్పడి యాయన యందలి గురు భావ మనల్పమై యినుమడించెను. శర్మకును వసంత కుమారుని యెడ వాత్సల్యము మెండు. ఇట్లా యుభయులు పరస్పర సహకార సానుభూతులతో కాలము వెళ్ళబుచ్చుచుండిరి. ఇట్లుండ నొకనాడు శర్మ, యిందిర, వసంత కుమారుడు గలసి సముద్రపు టొడ్డునకు వాహ్యాళి వెడలిరి. శర్మ తా నను కొనినంత యసభ్యవర్తి కాదు. అయినను అతనికి పులితో చెలగాటమనిన నెంతో భయము. అందుచే నిపుడు చాల మితభాషియై యిందిరా మనోభావములను కనిపెట్టుటలో నేమరకయుండెను.

ఆ యా వింతలు చూచుటలో సూర్యాస్తమయ మయ్యెను. అంతలో వసంత కుమారుడు శారద పత్రికను కొనితెచ్చుటకు రోడ్డుమీదకు బోయెను. అప్పుడు శర్మ, యిందిర తప్ప నా చాయలో నెవ్వరూ లేరు. అట్టి యేకాంత

సన్నివేశ మంతకు బూర్వమెన్నడు వారికి లభ్యము కాలేదు. ప్లీడరుగారి యిల్లు చాల పెద్దది. అయినను అందు ఏ యొక మందిరము ఎవరికి బ్రత్యేకింపబడియుండలేదు. అందరికి నుమ్మడిగా నుపయుక్తమయ్యె ఆ యింటిలో శర్మకూ, ఇందిరకూ ఏకాంత ప్రదేశమ నేదే కనబడలేదు. అట్టిదిప్పుడు సముద్రపు టొడ్డున వారు ఏకాంత సమావేశవశాత్తు కొన్ని మాటలు మాట్లాడుకొనినారంటే అది యంత యాశ్చర్యకర విషయము గాదని చదువరు లెరుగవలెను. వసంతుడు వారిని వీడి చనుటతోడనే ముదొక మందస్మితము వారి వదనాంచలముపై దోలకాడినది. వారిరువురు తమ హృదయము లొండొరు లెరిగించుకొను సమయ మదియే యని తోచెను గాబోలు—ఇందిర శర్మ చేయి తాను బట్టుకొని—

“ తగునోయీ మిత్రుడ ! నె
వ్వగలం దురపిల్ల ప్రేమబంధము లకటా !
తెగునోయీ తెగద్రెంపిన
మిగులగ నిత్తురె మనంబు మిథ్యాభ్రమలన్. ”

అని శ్రీ రాయప్రోలు కవి వ్రాసిన పద్దెమును చదివినది.

ఇందిర నాటిదనుక శర్మ అవివాహితుడనియే తలంచుచుండెను. ఎట్లైన నది యనుమానముతో గూడిన విషయమే. కారణ మేమన శర్మ తనవైపెప్పుడు చూచినను ప్రేమోద్విగ్న మనస్కునివలె చూచును. అట్టివాడు దనకు ప్రియుడు కాగలడని తలంచుటలో నిందిర తప్పేమియు లేదు. శర్మ తన కలవాటైన రీతిని జూచెనేగాని ప్రేమతో జూడవలె

నను నుద్దేశ్య మాతనిలో లేదు. శర్మ కిప్పుడు తీరని సమస్య వచ్చి పడినది. తాను వివాహితుడైననేమి? కాకున్ననేమి? ఇందిర కోరునది శర్మ ప్రేమోద్విగ్న హృదయమేనా, శర్మ శరీరమా? ఆయీ జిజ్ఞాసతో శర్మ క్రిందు మీదు చూచు చుండెను. అంతలో నిందిరా సురుచిర పరిష్వంగ సుఖ లోలుడు కావలసియుండిన నియమముండెను 'కాబోలు, వికంపితదేహయై వసంతుని సోదరి శర్మను తత్తరపాటుతో కౌగలించుకొనెను. శర్మ మరియు నిస్సహాయు డయ్యెను. అంతకు బూర్వ మెన్నడు ఇందిర అంత చొరవకు దిగియుండ లేదు. మీకు పెండ్లియైనదా యని మాత్ర మడుగుచుండె డిని. అయినదని శర్మ ప్రత్యుత్తర మిచ్చెడువాడు. అంతలో బోళ, మీ జందెమేది? మూడు ముడులున్నవా? అని యిందిర తిరిగి యాచోకీ తీసెడిది. ఇందిర యిట్లు తన్నపార ముగా ప్రేమించుచున్న సంగతి ప్లీడరుగారి యల్లునికి దెలియు నేమో యని శర్మ భయము. కాని నిప్పుడెంత కాలము గుడ్డలో దాయగలము?

## 3

వసంత కుమారుడు 'శారద' కొని తిరిగి శర్మ, ఇందిర ఉన్నచోటికి మరలి వచ్చుచుండెను. ఇంకను ఏబది గజముల దూరమున నుండగా శర్మ కౌగిటిలో నిందిర యొదిగియున్న దృశ్యము గోచరమయ్యెను. వెంటనే యించుక యసూయా గ్రస్తుడు కోపారుణిత లోచనుడు నయ్యెను. కాని యేమి చేయగలడు. తన తండ్రి యూరలేదు. ఆయన యుద్యోగ

రీత్యా తిరునల్వేలికి వెడలెను. తన తల్లితో నీ విషయము ప్రస్తావించుటకు సిగ్గు, అవమానము. అయినను తన సోదరి యింత అవివేకినియా? లజ్జాభిమానము లుజ్జగించి పరపురుషు నాలింగనము చేయునంతటి కుటిల వ్యాపారిణియా? అని తాను లోన మథనపడుచు వారున్న చోటికి వచ్చిచేరెను. ఇందిర, శర్మ యథాప్రకార ముండిరి. వారిలో నెవరిది తప్పో చెప్పజాలని స్థితియందు వసంతుడుండెను. అంత కంతకు జనసమ్మర్దము తగ్గుచుండుటచే సముద్రపు హోరు బాగుగా వినవచ్చుచుండెను. రేడియో ప్రసార మవసానదశకు వచ్చుచున్నది. వార్తలు వినుట అయిపోవుటతోడనే రికార్డు సంగీతమునకు మిగిలినవారు బీచిపై చెదురుగ నున్నారు. వసంతుడు తెచ్చిన పత్రిక నందుకొని యిందిర యందలి ప్రధాన వార్తలనుజూచి పత్రిక శర్మ కిచ్చెను. ఆతడు మద్యనిషేధముపై ఆరోగ్యశాఖామంత్రి యిచ్చిన ప్రసంగమును చదివి వసంతునితో నిట్లనెను. నిజంగా మన దేశములో అనారోగ్య మెక్కువవుతోందంటే యిందుకు మద్యమే కారణం. దీని నెన్నివిధాల నిర్మూలింపవలెనని చూచినను ప్రభుత్వమునకు శక్యం కావటం లేదు. నీ వంటి యువకు లిందున కేదైన మార్గమును కనిపెట్టి దాని నమలులో పెట్టిన నెంత బాగుండును? అని సూచనాద్యోతకంగా మాటలాడెను. వసంతునికి వెంటనే సంజీవి దృక్పథగామిని యయ్యెను. సంజీవిపాట యాతని హృదయమును హరించెను. తన సోదరికిగూడ నంత మధుర సుస్వరము లేదనిన నది తనకే లజ్జపాటు కలిగించును. కాని నిజముగా

సంజీవి గానసరస్వతియే. ఆమె పాటకు ముగ్ధుడు కాని కళా ప్రియుడు పట్నములో నరుదు. నాగయ్యపాడిన పాట ననుకరించుటలో నేమి మరియే యితర గాయక శిఖామణి నైనను విని తద్విధముననే పాడుటలో నేమి యామె అందె వేసిన చేయి. అట్టి సంజీవి ముందు తన సోదరి యేపాటిది అని వసంతుని కనిపించినది. వెంటనే యతడు కనుసైగ చేయుటయు డ్రైవరు కారు తీసికొనివచ్చి వారు కూర్చుండిన తావున నిలబెట్టుటయు జరిగినది. అంత ముగ్వురు కారులో కూరుచుండి గృహోన్ముఖులైరి.

# 4

వసంతుని తండ్రి తిరునల్వేలిలో రెండు నెల లుండిన మీదట తన భార్యకు జాబు వ్రాసెను. "నీవు వసంతుని దీసికొని యాతని అయ్యవారినిగూడ వెంట నిడుకొని యిక్కడకు బయలుదేరి రావలెను. స్టేషనుకు కారు పంపెదను." ఆ యుత్తర మందిన నాటి రాత్రియే వసంతుడు, అతని జనని, శర్మ ముగ్గురు ఎగ్మూరు స్టేషనులో త్రివేండ్రం ఎక్సు ప్రెస్సులో ఎక్కి తిరునల్వేలికి బయలుదేరిరి. ఇందిర శర్మకు కరచాలన మిచ్చి సాగనంపినది. ఆమె కన్నుల వెంట రెండు మూడు డశ్రుబిందువులుగూడ రాలెను. శర్మ వికంపిత దేహముతో నామెను వీడలేక వీడలేక వీడెను. వసంతు డిది యంతయు చూచుచుండియు నిస్తబ్ధవీణవలె నూరకుండెను. ఆతని తల్లి కూతు నుద్విగ్నత కించుకయు చలింప దయ్యెను.

బండి తెల్లవారు సరికి మనియాచి వచ్చి చేరినది. తాను ముఖప్రక్షాళనము చేయవలసి యుండుటచే శర్మ పండ్ల పొడికొరకు వసంతుని తల్లి నడిగెను. ఆమె తన పెట్టె తెరచి యందులోనుండి పండ్లపొడి తీసి శర్మ కిచ్చినది. ఆతడు దానితో దంతధావనము చేసి టిఫిను తీసికొని మరలివచ్చి తన పెట్టెలో నెక్కి కూరుచుండెను. కొంతసేపటికి రైలు బయలు వెడలెను.

రైలింపుక యాలస్యమగుటచే వారు తిరునల్వేలి యొంటిగంటకు చేరుకొన గలిగిరి. వసంతుని తండ్రి భార్యా పుత్రులను గలసికొని వారితో వచ్చిన శర్మనుగూడ వెంట నిడుకొని సొంత కారులో నింటికి వెడలెను.
వచ్చిన తరువాత శర్మలో చాల విచారభావము ప్రవేశ చూపెను. తాను తన స్వస్థలమునకు కొన్ని వందల మైళ్ళ దూరములో నివసింపవలసిన యవసర మేర్పడినందుకు కాతని కెక్కువ కొదువ యనిపించలేదు. కాని తన హృదయమును నపహరించిన యిందిర తనకు దూరమైనందున బాధపడ సాగెను. వసంతునికి పాఠము చెప్పుచున్నప్పుడు తాను వచ్చి పాఠము సాగనీయకుండ అల్లరి చేయుచుండిన, తన హృదయము మర్మములకు దాకునట్లు మాటాడగల్గుచుండిన, నవీన చంద్ర రేఖాసదృశమైన మోముతో దన్నలరింపజేసిన యిందిర, యిప్పుడు తనవద్ద లేదు. ప్రేమ సర్వమును ప్రకాశవంతముగా భావింపజేయునని, ఆ ప్రేమయే తెగినచో ప్రపంచము శూన్య మగునని వాదించువారి మత మాతనికి సత్యయుతముగా

దోచినది. అప్పటి వియోగకాలములో నతనిని కృశీభూత దేహిని జేసినది ఇంనిరా నిరుపమ రూప లావణ్యాతిశయము దూరీకృతమైన పరిస్థితియే.

వసంతునికి శర్మపై నించుక యసూయ యేర్పడెనని యిదివరలో నుడివితిమి. అది యిప్పు డాతనిలో గాఢమై శర్మను వంచించి తగిన శాస్తికి గురియైన వానినిగా జేయ యత్నించుచుండెను. అందుల కాతడు తన తండ్రితో శర్మపై లేని పోని చాడీలు చెప్పదొడగెను. వసంతుని తండ్రికి శర్మపై నెక్కువ ద్వేషము లేదు. కాని తన తనయుని చదువుకై వెచ్చించిన మొత్త మాతని రక్తములో గలిసియుండెను గదా యని యాతని కొక విపరీతపు టూహ పొడమెను. ఆతడెంత చెప్పినను ప్రాథమిక పాఠశాల విద్యయేగాని యంతకు మించినది గాదుగదా! అట్టి చదువు కింత మూల్య మేమి? అని యాతడు క్రొత్త వితర్కమునకు దిగెను. రోజులు శాంతముగానే గడచుచుండెను. కాని కాలగర్భములో నిమిడియున్న సంఘటన లిట్టివని యెవరు చెప్పగలరు?

వసంతుని మాటల కాతని తండ్రి లోబడుచుండెను. శర్మశీలమును శంకించుటకు గూడ ఆయన వెనుదీయడయ్యెను. ఒక రోజున తానా యూరినుండి బదిలీయై పోవుచున్న జిల్లా జడ్జికి వీడ్కోలిచ్చు సందర్భములో క్లబ్బుకు పోయెను. అప్పు డింట నెవ్వరూలేరు. శర్మ తా నున్న గదిలో పరుండి యుండెను. అప్పుడు వసంతుని తల్లి యాతనివద్దకు వచ్చి యిటనెను. ' ఏమండీ! మీరు మా యింట నారునెలలకు

పైగా నున్నారు. నాతో నెన్నడూ మాటాడి యెరుగరు. మీరు కవితాప్రియులని విన్నాను. ఒక్క సారి మీ గేయములు చదివి వినిపించండి. మీ శ్రమ నిష్ఫలము కానీయనులెండి. రండు నా గదికి బోవుదము. వారిప్పుడు రారు. వసంతుడు బజారుపోయినాడు. ఇంతలో రాడు.' అని అనునయముదోప బ్రతిమాలెను. శర్మ కాదనలేకపోయెను.

అంత నిరువురు నామె గదికిబోయి సోఫాపై నాసీనులైరి. వసంతుని తల్లి శర్మకు కడు దాపున గూరుచుండెను. ఆమె నేత్రములలో నెంత మధురిమ యున్నదో అంత ద్రోహచింతయు నుండెను. ఆ శర్మకీ రహస్యము తెలియదు. తెల్లనివి పాలనీ నల్లనివి నీళ్ళనీ నమ్మే స్వభావమాతనిది. అందుచే నామె కోరిక నెరవేర్చెను. ఆమె వెర్రిగా నవ్వుచు నతనిని జేతితోదాకి మరియు దాపునకు వచ్చెను. శర్మ వ్యత్యస్త చిత్తుడయ్యెను. కాని యామె వాలకము గ్రహింపలేకపోయెను. వారిరువురిట్లు లొంటిపాటున నుండగా గది గుమ్మమునొద్ద నొక వ్యక్తి ప్రత్యక్షమయ్యెను. శర్మ తటాలున లేచెను. ద్రోహమున కొడిగట్టితివాయని యా వ్యక్తి శర్మను గద్దించెను. శర్మ నిరుత్తరుడయ్యెను. వసంతునితల్లి చిడిముడి పాటుతో వేరొక గుమ్మముగుండా వెడలిపోయెను. వసంతుని తండ్రి గది యంతయు గలయద్రొక్కెను. శర్మను చేయి పట్టుకొని బయట కీడ్చుకు వచ్చెను. శర్మ దిగ్భ్రాంతి చెంది యొకచో గూలబడెను. 'నిన్ను నమ్మి నేను మోసపోయాను. నిన్నింట్లో పెట్టుకుంటే పాము నింట్లో పెట్టుకున్నట్టే'

నా సొమ్మంతా తిని నాసంసారంకూడా పాడుచేసి పోవాలని చూస్తున్నావా? నీ పెట్టె బేడ తీసుకొని యీ క్షణం యిక్కడనుండి వెళ్ళిపోవాలి నిన్నింక ఒక్క క్షణమైనా నేను సైరణ చేయలేను ' అని తుళ్ళి పడుతూ మాటాడెను.

శర్మ యీ విషమ పరిణామము కాలకూటీలత్వము చేత వచ్చెనని యనుకొని మూగు మాటాడక యీ సంధ్యారాగము నే నేత్రాగసకినుకూడా విలీనమాత్రా వుండగా నింటి గేటు మూసివేసెను.



# కథావళి

## శశిరేఖ

### 1

మాధవపల్లి బ్రాహ్మణాగ్రహారము. అక్కడ నివసించు బ్రాహ్మణులు నాలుగు వేదములయందును నిధులు. వేదాధ్యయనము వలన శిష్టులైన గావచ్చును. అందువలన వారు సంస్కారము పొందిన పొందవచ్చును. కాని యది వారిలో హృదయ పరివర్తనము గొనిరాగలదా ? వారు తమ నిత్య కర్మానుష్ఠానములను వేదోక్త విధానమున నిర్వర్తింపవచ్చును. కాని యది వారి దయాగుణమునకు నిదర్శనము కాజాలదు. అశోక చక్రవర్తిచే నహింసా చక్రమార్గ పర్యధిష్ఠితము గావింపబడిన హైందవ సంఘము గతమున కొంత కాలమునుండి హింసాయుత చర్యలచే గళంకితము గావింపబడి యుండుట గమనింపదగి యున్నది. మరల నీ దేశమున వితంతువుల మొర నాలకించువారు లేరు. మానవత్వము హింసాయుత చర్యలను ఖండించుచుండ, మన మధ్యలో నెంత చెడుగును కలిగి యున్నామో చూచుకొనవలయును. అస్పృశ్యతయను నింకొక కళంక మీ దేశీయుల యశోంబరమున తీరని మచ్చయై యున్నది. హిందూసంఘము బాగుపడవలెనన్న నస్పృశ్యతా నివారణ, వితంతూద్ధరణ యత్యావశ్యకములు.

మాధవపల్లిలో రామలింగయ్య యొక్క వ్యవహార వేత్త. ఆయన మద్దతు లేకుండ నాయూర జరిగెడు కలహమే యుండ బోదు. మాధవపల్లిలో నాయనచే నవమానింపబడని వ్యక్తి యరుదు. అయినను అన్ని కులములవారును ఆయనకడ కేదియో యొక పనిమీద పోవుచునే యుందురు. అట్టి సమయములలో ననివార్యముగా నాయన తన పలుకుబడిని పెంపొందింప జేసికొనును. గ్రామమున కొకమూల నివసించుచున్నను గ్రామస్థుల వ్యవహారము లన్నియు నాయనకు గావలయును.

రామారావు మాధవపల్లికి క్రొత్తవాడు. తన మేనత్తను జూచుట కా గ్రామము వచ్చెను. ఆమెకు శశిరేఖ యను కూతురుగలదు. శశిరేఖను రామారావు అన్నగారి కిచ్చి పెండ్లి చేసిరి. పెండ్లియైన యేడాదికి రామారావు అన్నగారు గతించెను. శశిరేఖ వితంతువైన నాటినుండి యామె పునర్వివాహము విషయమై గ్రామములో నెక్కువ గొడవగా జనులు మాట్లాడుకొనుచువారు. కాని యథార్థముగా పునర్వివాహము జరుగలేదు. ఈలోగా జనులలో గుస గుసలు బయలుదేరినవి. ఎవరో ఒక యువకు నామె నిగూఢముగా ప్రేమించినదనియు, ఒక శిశువునుగూడా ప్రసవించినదనియు జనులు చాటు చాటుల ననుకొనుచువారు. ఈ యపవాదు కంతకు రామలింగయ్య కేంద్రమనవలసియుండెను.

ఒక పర్యాయము రామారా వేలూరు పోయియుండెను. అప్పుడక్కడ గల యొక కాఫీహోటలులో నాత

డొక బాలికను జూచెను. ఆమె తన యాకార రేఖలలో శశిరేఖను బోలియుండెను. ఆ హోటలు యజమాని రామా రావున కా బాలిక పూర్వవృత్తాంతమంతయు సమగ్రముగా వినిపించెను. రహస్యమును బయటకు పోనీయవలదనియు నాతని వేడుకొనెను. నాటినుండియు రామారావు శశిరేఖ శీలమును శంకింపదొడగెను. కామ వాంఛా పరిపూర్తికై యామె తన శీలమును నీట గలిపినదనిన నాతడు విశ్వసించును గాని యామె నికృష్టముగా జీవించుటను జూచుటకు మాత్రము నిచ్చగింపడు.

## 2

అనాథ శరణాలయమున నుండదగిన యొక బాలిక కాఫీహోటలులో రాత్రింబవళ్ళు కష్టించి పని చేయుచుండుట చూచి రామారావు చాల వ్యధ చెందెను. ఆమెను తన రక్షణమునకు దీసికొని వచ్చుటో లేక మనకేల యని యూర కుండుటో యాతనికి దెలియలేదు. సంఘ సంస్కరణమనిన నాతని కమితమగు నాసక్తి. కాని యది బ్రాహ్మణ తావ లంబులకు మాత్రమే సాధ్యము. రామారావు హిందువుడు. అట్టివా డేరీతి నొక యనాథ బాలికకు రక్షకత్వమును వహింపగలడు? శశిరేఖపై లేనిపోని యపవాదులను వ్యాప్తిలోనికి దెచ్చి యామె పరువు తీయవలెనని రామ లింగయ్య చూచుచుండెను. ఆమెను సరియగు మార్గమున బెట్టవలెనని రామారా వెంచుచుండెను. తా నేలూరున గని విని వచ్చిన వృత్తాంతమును రామలింగయ్యకు జెప్పినచో

కోతికి కొమ్ములు తెచ్చినట్లగునని రామారా వభిప్రాయ పడెను. అందుచే నాతడా విషయమేమియు రామలింగయ్య కెరుకపరుపలేదు. తరువాత కొలది కాలములో రామారావు స్వగ్రామమునకు మరలెను.

రామారా వింటియొద్ద నున్నకాలములో జడుడై పోయెను. అక్కడ నాత డెక్కువకాలము నివసింపలేదు. ఆతడు తిరిగి పయనమై మద్రాసునకు బోయెను. మద్రాసులో నతనికి యోగానందరా వను మిత్రుడుండెను. ఆతడు మద్రాసు పరిసరమున గల ఆవడిలో నివసించుచుండెను. తనయింట నడుగిడగానే యోగానందరావు రామారావును కుశలప్రశ్న పూర్వకముగా నాదరించి లోనికి దోడ్కొనిపోయి భార్య కెరుక పరచెను. 'ఈతడు నా పూర్వమిత్రుడు. సహాధ్యాయి. ఈ నగరము నన్ను చూచు నిమిత్తము వచ్చినాడు.'

రామారావు మిత్రునియింట రెణ్ణాళ్ళు గడపెను. మూడవనాటి యుదయము రామారావు తన స్నేహితుని ద్విచక్రశకటము నడిగి తీసికొని నగరము నవలోకించుటకు బయలువెడలెను. అతని గమ్యస్థానము త్యాగరాయనగరము. అక్కడ నాతని బంధు వొకరు ఫిల్ము వ్యాపారమున బనిచేయుచుండెను. అతని జూడవలెనని రామారావు కోరిక. కాని యిప్పు డెకారొకెకి నచ్చుటికిబోక. దారిలో ననేకములగు వింతలను జూచుచు నాత డాలసించెను. ఆ కారణమున నాతడు త్యాగరాయ నగరము నందలి నాయకురోడ్డు చేరుకొనుసరికి రాత్రి యెనిమిది గంటలయ్యెను.

# 3

ఒకనాటి సాయంకాల మొక యువతీ యువకుల జంట మద్రాసు నందలి మౌంటురోడ్డునకు కుడివైపునగల కాలిబాటపై నడచి వచ్చుచుండెను. వారొండొరుల చేతులు పట్టుకొనిరి. వారి ముఖము లానంద కందళితములై యుండెను. వారి నేత్రములలోగల మోహము వారి ప్రేమజ్వర తీవ్రతను వెల్లడిచేయుచుండెను. మరియు నా మోహము వారు మద్రాసునకు తరలి యేతెంచిన యొక పావురపు జంటయనియు, ఆకాశమును చీల్చుకొని వచ్చిన రోహిణీ శీతకిరణులనియు, స్పష్టము చేయుచుండెను. కంఠమున స్వర్ణహారము, చెవుల గమ్మలు, మల్లెలచే నలంకృతమైన కేశభారము, భయవిహ్వలతను, మౌగ్ధ్యమును వెలిగ్రక్కు నేత్రములును గలిగి యా యువతి యొక జానపద బాలికయయ్యు నగరవాసమున కియ్యకొని వచ్చిన యువతిగా నెవరికైనను నగుపడును. ఆమె యొక పట్టు చీరను గట్టినది. ఆపె పైటచెరగు గాలిలో నెగురుచు నొక మెరపు కలువవలె దోచినది. ఆ యువకుడు ప్రియురాలి కనుసన్నలో నడచి వచ్చుచుండెను.

పారగన్ సినిమాహాలు చేరువరకు వారట్లే నడచిరి. అక్కడకు చేరగనే వారు రెండు టికెట్లుకొని లోనికి బ్రవేశించిరి. అప్పటికే చిత్ర మారంభింపబడెను. వారు లోనికి బోవునపు డంతయు నంధకార బంధురమై యుండెను. వారు

రెండు సమున్నత స్థానములం దాసీనులై యాట నవలోకించు చుండిరి. నాల్గవదృశ్య మగుసరి కా జంటలో యువతి కమిత మగు బాధ కలిగెను. అంతటితో వారు సినీమాను వదలి బయటికి రావలసినవారైరి. వెలుపలికివచ్చి వారొక రిక్షా బండివానిని బిలిచి తమ్ము నాయరురోడ్డుకు దీసుకుపొమ్మని కోరిరి.

నాయరు రోడ్డు త్యాగరాయ నగరమున నున్నది. ట్రిప్లికేనునుండి మౌంటురోడ్డుమీదుగా త్యాగరాయనగరము వచ్చు నే బండియైనను అక్కడకు రాకతప్పదు. అక్కడ నొక దిక్కూచిగలదు. సెంట్రిలునుండి నుంగమ్‌బాకమ్ మీదుగావచ్చు బండ్లుగూడ నాయరురోడ్డు వచ్చును. యువతీ యువకులు రిక్షాబండిమీద వచ్చు వేళకు నాయరురోడ్డు దగ్గర నొక ప్రమాదము సంభవించెను. ఒకానొక యువకుడు త్రొక్కుడు బండిపై కడువేగముగా వచ్చుచుండెను. అతనికి రిక్షావాని కనుకు దీపము కంటికానలేదు. ఆ కారణమున నతడు రిక్షాబండికి తాకిడియై సైకిలుపై నుండి క్రిందబడెను. అట్లు పడుటలో నతడా సమీపమునగల యొక దీపపు స్తంభ మునకు కొట్టుకొని తీవ్రముగా గాయపడెను. రిక్షావాడు బండిని జారవిడచి తప్పుకొనెను. రిక్షాబండి తారురోడ్డుపై కొంత దూరము జర జర పాకెను. యువతీ యువకుల కేమియు గాయములు తగులలేదు. యువకునకు తలపై గట్టి దెబ్బతగిలినది. స్మృతితప్పి పడిపోయెను. త్రొక్కుడు బండి భిన్నా భిన్నమయ్యెను. యువతీ యువకులు చాల భయ

భ్రాంతులైరి. కాని ధైర్యమును కోల్పోవలేదు. వారు రిక్షానుండి దిగి యువకుడు చాల అలసిన స్థితిలో నుండుట గమనించి తమతో దమ నివాసమునకు గైకొనిచనిరి.

# 4

యువకుని గతి యేమయినది? యువతీ యువకు లేమైరి? వారి తదనంతర వృత్తాంత మేరూపము దాల్చెను? అను నీ విషయములు మన మవలోకింపవలయును. నాయరు రోడ్డు కీశాన్యముగా నొక పేట గలదు. అక్కడ నివసించు వారిలో కొంద రాంధ్రులుగూడ గలరు. వారందరు ఫిల్ము వ్యాపారమున బని చేయుచుండిరి. వారికి మంచి వేతనములు గలవు. అయినను వారి కేనెల కానెల యిండ్ల వద్దనుండి మనియార్డరులు రాకతప్పదు. కారణమేమన నీ యాంధ్రు లెక్కడ నివసించినను విలాస జీవనము చేయకోరిక కలిగి యుందురు. ఇతరుల సహకారము నెక్కువగా నర్థింతురు. వంటమనిషి, కారుడ్రైవరు మున్నగునందరు వారి యీ సుఖాభిలాషను ప్రోత్సహించెడివారే. కడుదూరమున నివ సించుచుంటిమను కించ యాంధ్రులలో మాత్రము కానము. అందువలన తమిళుల కిది లాభకరమే యయ్యెను. వారికి జీవనోపాధి సులభమయ్యెను. ఆ కారణము వలన నీ ప్రాంత ములో దినమున కేడెనిమిది రూప్యము లార్జించువారికిగాని జీవితము సుఘటము కానేరదు.

రిక్షాబండి, సైకిలు తాకిడియయిన సమయములో గాయపడిన యువకునకు కట్టు కట్టబడి విశ్రాంతి సమకూరిన పిమ్మట నాతనికి తెలివి వచ్చుసరికి రాత్రి యొంటిగంట యయ్యెను. అప్పుడాతడు కనులు తెరచి చూచి యెదుట నొక వైద్యుడుండుట పరికించెను. ఆతడొక పానీయమును తెచ్చి నోటి కందించుచుండెను. యువకుడది త్రావి శయ్యపై గూరుచుండగలిగెను. "అయ్యా, తామెవరు?" అని యువకుడా వైద్యుని బ్రశ్నించెను. "ఆ విషయము మీకు క్రమశః తెలియగలదు. ఇప్పుడు మీరు విశ్రాంతి తీసికొనవలయును" అని పలికి వైద్యుడాతనిని మరల బరుండ జేసెను.

డాక్టరు వెడలిన కొలది నిముసములకే క్రింది సంభాషణ లోపలి తట్టునుండి వినవయ్యెను. "శశీ! నీవు నా ప్రతిజ్ఞను కుంచిత మొనర్చితివని నేననను. నీవు నన్ను పెండ్లాడ గోరితివి. అందువలన నీకు కులభ్రష్టత కలుగునని హెచ్చరించితిని. అందులకు సిద్ధపడితినని నీవంటివి. కాని యీ వృత్తాంతము నీ తల్లికి దెలిసినచో నామె చాల దుఃఖించును."

"అందులకుగూడ నేను సంసిద్ధముగానే యున్నాను."

"అదీగాక నీవిపుడొక శిశుమాతవై యున్నావు. ఆ శిశువు నొకని సంరక్షణ క్రింద నుంచితివి. ఆ బాలిక యిప్పుడు పెరిగి పెద్దదైనది. ఆమె నీ కూతురని లోకమునకు దెలియదు."

"లోకమునకే కాక యా బాలికకును నేను దాని తల్లి నని తెలియదు."

"ఇప్పుడు నీవు నాతో గలసి జీవించుకోరిక కలిగి యుంటివేని అది పరిస్థితు లన్నిటిని తారుమారు చేయును."

లోపలినుండి వినబడ్డ యీ మాటలు యువకుని చాల సంశయ లోలుని జేసెను. శశిరేఖ తలవని తలంపుగా తా నాడుచుండిన నాటకమునకిది నాంది యగునేమో యని యతడు తలంచెను. తొలుత 'శశీ' యని సంబోధనము, పిమ్మట వివాహ ప్రస్తావనము, తరువాత నొక బాలిక జనన విషయమునను నివియన్నియు యువకున కనుమానము కలి గించెను. కాని యీ యువకున కెక్కువ సందేహ భాజన మైన దాతడు అప్పుడున్న ప్రదేశము. కడు వేగముగా దాను సైకిలు త్రొక్కుకొని వచ్చుటయు, నొక రిక్షాబండికి దాను డీకొనుటయు తప్ప తదితరమేమియు నాతనికి స్మృతిలేదు. ఇప్పుడు తల కొక కట్టు కట్టబడియున్నది. ఒక వైద్యుడు సమీపమున నున్నాడు. ఆ వైద్యుడెవరో, ఆ ప్రదేశ మే ప్రదేశమో యువకునకు దెలియదు. డాక్టరుకు యువకుని యెడగల ప్రత్యేక గౌరవము గమనించితిమేని, అతనికి యువ కుని యెడ ననురక్తి కలదనియు తెలియనగును. లోన నుండి వినబడు సంభాషణ ధోరణి జూడ యువతియు గాయ పడిన యువకునిపై నాదరము కలిగియున్నదని తెలియగలదు. కాని యామె యువకుని దృష్టి కగుపడకుండ నుండుట చూడ నాతడామె కాప్తుడై యుండియు కారణాంతరములచే నిప్పుడు

పరిహరించుచుండెనని స్పష్టమగుచున్నది. ఆమె కంఠధ్వని యువకుని కదివరలో వినికిడి యయినట్లే యుండెను. కాని యామె యెవరో యాతనికి సుదృఢము కాలేదు.

# 5

మనము శశిరేఖను మాధవపల్లిలో వీడి వచ్చితిమి. ఆమె యా యూర చాలకాలము నివసింపలేదు. కులమువా రంద రామెను వెలివేసిరి. కావున నామె స్వతంత్ర జీవనము చేయ నభిమతించినది. స్వగ్రామమును వీడి యామె యేలూరునకు వచ్చినది. అక్కడ నామె పెరిగి పెద్దదై యున్న తన కూతును గాంచినది. కాని తానా బాలికకు తల్లియైన విషయమును బయటపెట్టలేదు. తన కూతును రహస్యముగా జూచినది. అందువలన నామె కాత్మలో తృప్తి కలిగినది. అటనుండి యామె తనకు ప్రసవకాలమున సాయపడిన వైద్యుని పద్దకు బోయినది. ఆ వైద్యునికి చాల సంతోషము కలిగెను, గాని యామె యీ సాహసమున కచ్చెరువు చెందెను. అదే సమయమున నాతడు మద్రాసు నకు పోవనెంచుచుండెను. మద్రాసులో దన వైద్యవృత్తి యెక్కువ లాభదాయకముగా నుండునని యాతడు భావించెను. శశిరేఖ యాతని ననుగమింపదలంచెను. అందుచే నామె దనను వైద్యమున సహకారిణిగా దీసికొనుమని యాతని వేడెను. అతడందుల కనుమతించిన మీదట వారుభయులు సామాను మొదలైనవి రైలులో వైచి మద్రాసునకు తరలిపోయిరి.

మద్రాసులో వారొక సువిశాల భవనమును దీసికొని యందు నివసించుచు నందే రోగులకు చికిత్స చేయుచు కాలము పుచ్చుచుండిరి. శశిరేఖ యీ విధముగా దన దుఃఖమంతయు మరువగలిగినది. తల్లిని తదితర బంధువు లందరిని యామె మరువగలిగినది. అయినను ఆమె హృదయమున తీరని యాందోళన గలదు. అది తన తనయను గూర్చియే. మరొకరుగూడ శశిరేఖ మనస్సులో తరచు ప్రత్యక్షమగుచుండిరి. అతడు రామారావు.

రామారావు నాయరురోడ్డువద్ద జరిగిన ప్రమాదములో చిక్కుకొనెననియు, నాతని నొక యువతీ యువకుల జంట తమతో తమ నివాసమునకు గైకొని చనిరనియు మనము తెలిసికొంటిమి. ఆ యువద్వయము డాక్టరు, శశిరేఖయే యని గ్రహింపవలయును. వారిరువురు రామారావు నెరుగుదురు. కాని శశిరేఖ రామారావుతో డాక్టరు కంటె నెక్కువ పరిచితి గలిగియున్నది. అందుచే నామె రామారావచట నున్న కాలములో నాతని కన్ని సదుపాయములు నొనగూర్చినది. వారిరువురు బంధువులని డక్టరెరుగడు. శశిరేఖ తనకు సహకారిణి యనియును, రామారావు నొక రోగిగను మాత్రమే యాత డెరుగును.

ఒక నాడు వైద్యుడు తనమిత్రులగు కొందరిని విందునకాహ్వానించెను. వారిలో రామారావు మిత్రుడైన యోగానందుడుగూడ గలడు. ఆ క్షణమువరకు రామారావుకు తగిలిన గాయమునుగూర్చి యోగానందు డెరుగడు. ఇప్పుడాత

దున్న స్థితినిగాంచి యోగానందు డచ్చెరువుపడెను. యోగానందుని భార్యా పుత్రులుగూడ తమ కుటుంబమున కంతకు మిత్రుడైన రామారావునకు వాటిల్లిన కష్టమునుజూచి రిచ్చపడిరి. యోగానందుని భార్య కండ్లనుండి యశ్రువులు రాలెను. ఆమె రామారావు నిట్లు పలుకరించెను. 'ఒక పక్షము దినములనుండి మీ యాచోకీ మాకు తెలియలేదు. మా పిల్లలు మీ యెడ బెంగగొని యున్నారు. మీ కేదైన విపత్తు సంభవించిన మాకొక యుత్తరము వ్రాసినచో బాగుండెడిది. ఈ క్షణము వరకు మాకు మీదురవస్థనుగూర్చి యేమియు దెలియదు.''

రామారావు లజ్జచే దలవ్రాల్చికొనెను. యోగానందుని బిడ్డ లాతని చుట్టును మూగి తమ జనని కంఠమే తమకును రూపొందినట్లు మాట్లాడిరి. వారిలో ముఖ్యముగా యోగానందుని కూతురును రామారావు దన కూతురుగా మన్నించుచుండెను. ఆమె అక్కడ గడపిన ప్రతి నిమిషమును రామారావును నాతని యస్వస్థతనుగూర్చి ప్రశ్నించుటలోనే గడపెను.

సాయంకాల మూరు గంట లగుసరి కతిథులందరు డాక్టరుగారికి ధన్యవాదము లర్పించుచు వెలుపలికి రాదొడగిరి. రామారావొక్కడు మాత్రము మిగిలిపోవలసిన పరిస్థితి యేర్పడు నట్లుండెను. కాని యట్లు జరుగగూడదని యాతని యభీష్టము. ఆ రోజున నెట్లైన తానా యిల్లు వీడిపోవుట కాతడు నిశ్చయించెను. యోగానందుడు మిత్రుడైన రామా

రావును దనతో నావడికి రమ్మని యాహ్వానించెను. కావున నిప్పుడు రామారావు డాక్టరుగారి క్రింది మాటలతో కృతజ్ఞతా పూర్వకమైన యంజలి నర్పించెను. 'ప్రియమైన డాక్టరుగారూ! నాకు సెలవిప్పించ వలయును. నన్ను నా బాధనుండి విముక్తుని జేయుటకు మీరు పొందిన శ్రమకును, మీరిచ్చిన చికిత్సకును మిమ్ము నే నభినందించుచున్నాను. నేను నా స్వస్థలమునకు బోవనెంచుచున్నాను. మీ ఋణము నే నెన్నటికి దీర్పజాలను.''

డాక్టరుగారును రామారావు శీఘ్రకాలమున గాయము మాని స్వస్థుడైనందుల కాతని నభినందించుచు వీడ్కొలిపిరి. అతనివద్ద నెట్టి రుసుమును కోరలేదు. కాని శశిరేఖ కాతని యెడగల ప్రత్యేక శ్రద్ధ డాక్టరును కలవరపెట్టెను.

రామారా వెట్టకేలకు డాక్టరుగారి నివాసమునువీడి యావడికి వచ్చెను. ఆవడిలో నాతడు చాల నిరుత్సాహముతో కాలము పుచ్చుచుండెను. తాను డాక్టరుగారియిల్లు వీడి వచ్చునపుడు శశిరేఖ తన వైపెంత దీనముగా జూచినది యాతని కిప్పుడు స్మరణకు వచ్చుచుండెను. కాని యామె యేల యీ ప్రవాసమున కియ్యకొని వచ్చినదో యాతనికి బోధపడలేదు. ఆమె యిట్లు విదూరస్థలమున జీవించు పద్ధతికి డాక్టరుగారెట్టి వత్తిడియు జూపుటలేదు. ఆమె యీ దూర దేశమునకు వచ్చుటకు కారణము తన బంధువులపై బొడమిన యలుకయే కావలెను. వారంద రామెను అగౌరవపరచినట్లు

భావించుటచే తా నీ విధముగా వారిని శిక్షింపదలచెను. రామారావీ రీతిని దలచి యెట్లయినను నామె తన యింటికి మరలు మార్గమున బెట్టవలెనని కాంక్షించెను.

ఒక నాటి రాత్రి చాల ప్రొద్దుపోయిన పిదప రామారావు హఠాత్తుగా మేల్కాంచి వాకిటి తలుపు తెరచి వీధి లోనికి వచ్చెను. ఆ బజారునకు మూలలందు గల విద్యుద్దీపములు మాత్రము వెలుగుచుండెను. ఎక్కడను మనుష్య సంచారము లేదు. ఆకాశమున నక్షత్రముల నడుమ నర్ధ చంద్రుడు వ్రేలాడుచుండెను. రామారావు మనస్సున గల యభిప్రాయమేదియో యెవరికిని దెలియదు. మిత్రునికైనను దెలుపకుండ నింటి వెలుపలికి వచ్చెను. వీధి వెంబడి కొంత దూరము నడచి యాతడు నిలిచిపోవలసిన వాడయ్యెను. అతనియెదుట విరబోసికొనిన జుట్టుతో వికటాట్టహాసముతో నొక యువతి ప్రత్యక్షమయ్యెను. ఆమె యొక దయ్యమై యుండునని యాతడు భ్రాంతి చెందెను. కాని యామె తనను సమీపించినకొలది నాతని యనుమానము తీరెను. ఆ యువతి శశిరేఖయే యని యాతడు గురుతించెను. "వదినా ! నీ విక్కడ కెట్లు రాగలిగితివి ?" యని యాత డద్భుతరసావేశముతో నడిగెను. "ఇస్" అని యా యువతి మారుపలికెను. "ఇప్పుడు మాట్లాడదగిన దేదియు లేదు. ఈ యపవాదునుండి నన్ను కాపాడవలయును. నేను అనాథనైతిని. పరిభ్రష్టనైతిని. లోకులవలని హింసను భరింప జాలను" అని పలికి యామె కన్నీటి వెల్లువలుగా దుఃఖించెను.

రామారావు హృదయము కంపించెను. ఆ నిరాశా నిస్పృహాలనుండి యామె నుద్ధరింప నిశ్చయించెను. తన్ననుగమింప వలసినదిగా నామె నతడు నియమించెను. వా రిరువురు యోగానందు నింటికి వెడలిరి. తలుపు తెరచియేయుండెను. రామారావు శశిరేఖను లోనికి గైకొనిచని తానంతకు బూర్వము పరుండిన మంచముపై బరుండజేసి తాను మిత్రుని గదికి వచ్చి యతనిని నిదురనుండి మేల్కొలిపెను. శశిరేఖ వచ్చినదని రామారావు మిత్రున కెరుకపరచెను. అంతట వారిద్దరు శశిరేఖ యున్న గదికి వెడలిరి.

వారు లోనికి తొంగి చూచిరి. దుఃఖదేవతవలె నున్న శశిరేఖను జూచి రామారావును తన్మిత్రుడును చలిత హృదయులైరి. ఆమె తన తల చేతులతో నొత్తిపట్టుకొని విలపించుచుండెను. రామారా వొక్కడు గదిలోనికి వచ్చెను. శశిరేఖను జూచి యాత డిట్లనెను. "అమ్మా నీకు కావలసిన సహాయమేమి ? నీ విషయమే నేనింతకు బూర్వ మాలోచించుచున్నాను. నీ వింటిపై బెంగపడితివనుమాట సువిదితము. నీవు బయల్దేరి వచ్చెదు పక్షమున నిన్ను నేనింటికి దీసుకుపోగలను." శశిరేఖ యిట్లనెను. "మరదీ ! ఈ జీవితముపై నాకాశలేదు. నేను వర్ణభ్రష్టురాలనైతిని. నేనీ స్థలమునకు భ్రాంతి పరవశనై వచ్చితిని. ఆ డాక్టరు నాతో మాయమాటలు చెప్పి మోసగించినాడు. నేను నా సమస్త ధనమును వాని చేతుల నిడితిని. ఇప్పుడతడు నాయెడ విసువు చూపుచున్నాడు. నేను వానికి శ్రమదాయినిగా

నగుపడుచున్నాను. నీ వక్కడ నున్నకాలములో నీ విషయ మును గమనింపలేదా ?"

"తప్పక గమనించితిని. కాని కాలమనుకూలముగా లేనందున నిన్నాదాస్యమునుండి ముక్తురాలిని జేయజాల నైతిని."

"నీవా స్థలము వీడిన మరుసటి దినము వాడొక పత్రముపై నన్ను వ్రాలు చేయుమనెను. నేను వానికడ నర్సుగా నారేండ్లు పని చేయు షరతు నం దుదాహరించెను. అట్టి పత్రిముముపై వ్రాలు చేయుటకంటె నాత్మహననము గావించుకొనుట మేలని నేను తెలిపితిని. అంతట నాతడు నన్నుద్యోగమునుండి తొలగించి, వేరొకరి నాపనిలో నియ మించెను. నా డబ్బు వాపసు చేయవలసినదని వాని నడి గితిని. "నీకా డబ్బుతో నేమియు నిమిత్తములే"దని వాడు నన్ను గద్దించెను. మీదు మిక్కిలి వాడు నా బిడ్డకు సంరక్షకుడనని వాకొన దొడగెను. నేను ఏడ్చి యేడ్చి నిన్న సాయంకాల మాయిల్లు వీడి నిన్ను గలసికొను తలంపుతో బయలుదేరి వచ్చితిని.

"నే నిక్కడ నుంటినని నీకెవరు చెప్పిరి ?"

"నీవు డాక్టరుకు వ్రాసిన యొక జాబు చూచి తెలిసి కొంటిని."

వారంతట తమ సంభాషణ నాపవలసినవారైరి. గది వెలుపల నిలబడిన యోగానందుడు రామారావును బిలిచెను.

రామారావు మిత్రుని గలసికొని, యనంతరము వారుభయులు సెంట్రలు స్టేషనుకు బోవుటకై కారును సిద్ధపరచిరి.

# 6

మరునాడు ప్రొద్దుననే యా యువత్రయము సెంట్రలు స్టేషనుకు కారులో బయలుదేరిరి. అది ప్రయాణీకులతో జాల సందడిగానుండెను. రామారావు శశిరేఖను స్త్రీల విశ్రాంతి గృహమునకు దీసికొనిపోయి యామె నట వేచియుండ నియమించెను. ఆమె గదిలోనికి జాల విరాగముగా ప్రవేశించి యొక పడక కుర్చీపై మేను వ్రాల్చెను. ఆమె నలువైపుల జూచి యొక మూల నిరువురు స్త్రీలు, ఒక బాలిక యుండుట గమనించెను. శశిరేఖ తన యొడ లొకదుప్పటిలో గప్పికొని యుండుటచే నితరుల కామె సులభముగా గుర్తింపరాకుండెను.

మూల గూర్చుండియున్న స్త్రీలా ప్రదేశమునకు కేవలము క్రొత్తవారనుటకు వీలులేదు. వారు ధరించిన యుడుపులు, మాటాడు భాష వా రాంధ్రులని స్పష్టపరచినను, ఎక్కువ పరీక్షించి చూచిన వారు జన్మతః తమిళులని దెలియగలదు. వారిని, వారి మధ్యనున్న బాలికను శశిరేఖచూచి యా మరుక్షణముననే తన చూపు నతివేగముగా మరల్చుకొనెను. ఆమె నేత్రములలో నేమి, ఆమె పెదవులపై నేమి, ఫాలతలమున గల రేఖలలో నేమి యప్పుడు గనబడునది భయంకర కోపము మాత్రమే.

అంతట శశిరేఖ యేమియు కాలవిలంబము కానీయక తన రొండి నుండి యొక పొట్టము దీసింది. దానిపై నున్న కాగితమునువిప్పి కుంకుడు కాయంత పరిణామముగల నల్లని పదార్థము పైకి తీసినది. దానిని వేళ్ళ కొనలతో బట్టి పైకెత్తి అంగట వైచుకొనినది. సమీపముననున్న స్త్రీ లిది యంతయు గాంచిరి గాని వాదించుట కించుకయు వ్యవధి లేదు. కొలది నిమిషముల తరువాత రామారావును తన్మిత్రుడును క్రమ్మరి వచ్చిరి. శశిరేఖ స్మృతితప్పి పడియుండుట చూచి వారు నిర్విణ్ణులైరి.

రామారావు మిత్రుని వెల తెల బోయిన మోముతో జూచి 'అనుకొన్నంతా జరిగినది' అని యనెను. నేలపై బడి యున్న కాగితమునుబట్టి యెత్తి వాసన చూచెను. యోగానందుడు గూడ అట్లు చేసెను. అందలి మత్తుపదార్థము నల్లమందే యని వారభిప్రాయపడిరి. అచ్చటి స్త్రీ లిద్దరు ముందునకువచ్చి 'యీ పడియున్న యువతి నల్లమందు మ్రింగిన'దని చెప్పిరి. రామారావు చాల భయపడెను. విరుగుడేమైన నున్నచో నది యవశ్య మిప్పించవలయునని మిత్రుడనెను. ఆ యిద్దరు స్త్రీలు శశిరేఖయెడ చాల నాతురత చూపిరి. ఆమె చిత్తస్థితి నెరింగియు నట్లొంటరిగా వీడి పోయినందులకు రామారావును వారభిశంసించిరి. వారి యీ నేరారోపణకు రామారావొడంబడి కుమిలి యేడ్చెను. యోగానందుడు స్త్రీలపైని నిశితవీక్షణమును బరపి 'మీదే యూ'రని యడిగెను. 'తమ నివాసస్థల మేలూ'రని వారు

తెలిపిరి. వలూరకనుమాట వినిపించగనే రామారావు గిరుక్రన తిరిగి వెనుక తట్టుననున్న బాలికను చూచెను. ఆ బాలిక భయముతో గజ గజ వణకు చుండెను. స్త్రీ లిద్దరు శశిరేఖను సమీపించి తమ చేతు లామె తలకును, యొడలి కిని క్రిందుగా బోనిచ్చి తమ యొడులలోనికి జేర్చిరి. బాలికయు సమీపమునకు వచ్చెను. ఆమె యేడ్చి యేడ్చి గొంతు బొంగురుపోయెను. శశిరేఖ కనులు విచ్చి చూచెను. తన యెదుట నేడ్చుచున్న బాలికను చేతులలోనికి లాగికొని కౌగలించుకొని, "నాచిన్నికూనా! నిన్నుకన్న పాపిష్ఠురాలను నేనే. నిన్నీలోకమున వీడిపోవుచున్నాను. ఏడువబోకు. కరుణామయుడగు భగవంతుడు నిన్ను సాకగలడు" అని పలికెను. అంతట నామె రామారావును జూచి యిట్లనెను. "మరదీ! నా మూలమున నీవిన్ని కష్టముల పాలైతివి. నేను మీ వంశమునకు కళంక మాపాదించితిననుమాట కాదనను. నా చర్యను నేను సమర్థింపబూనుట లేను. ఇవే మీకు నా కడపటి నమస్కారములు. నా బిడ్డను నీ కప్పగించుచున్నాను. నీ వస్వస్థుడవై యున్నకాలములో నా వలన నీకేమైన మేలు జరిగినచో దానిని మరువకుము. నీనుండి నేను గోరు ప్రత్యుపకృతి యిదియేసుమా!" శశిరేఖ నోరువంకర తిరిగి యింకను మాటాడుకొనుట కామె యశక్తయయ్యెను.

అంతలో విశ్రాంతి మందిరమునకు వెలుపల జనులు మూగిరి. వైద్యుని బిలుచుకొని వచ్చుటకు బోయిన యోగా

నందుడు తిరిగి వచ్చెను. రోగిని దన సమక్షమునకు దీసి కొనిరమ్మని డాక్టరు కబురు. కాని యెట్టి వైద్యసహాయము లభింపక పూర్వమే శశిరేఖ యీ లోకమును వీడిపోయెను.




కృష్ణా స్వదేశీ ప్రెస్, మచిలీపట్నం.

